# పాంచజన్యము





గ్రంథకర్త

కవికోకిల, కవితావిశారద

జ్ఞానానందకవి



సహకార శాఖామాత్యులు: గౌరవనీయ శ్రీ డి. సంజీవయ్యగారు

# పీఠిక

ఈ "పాంచజన్య" రచయిత జ్ఞానానందకవి. ఈయనకు కవికోకిల, కవితావిశారద, యను రెండు బిరుదులు కలవు. ఈనాడు బిరుదము లేని కవియే లేడు. ఉన్న బిరుదములయొక్క సార్థక్యము నిరూపింపబడినచో నది యీకాలమున గొప్ప. ఈ రెండు బిరుదముల కర్థము— మధురముగాఁ గవిత్వము వ్రాయగలవాడనియు, రచనలోని రహస్యము తెలిసినవాడనియు,

మాధుర్య మనేక విధములు. మధురముగాఁ గవిత్వము వ్రాయుట యనగా కొందరి కొకటి మధురము. మరికొందరికి మరొకండు మధురము. ఈ మాధుర్యము రెండు విధములు. మొదటిది శబ్దగతము. రెండవది అర్థగతము. శబ్దగతమైన మాధుర్యము చాలమందికిఁ దెలియును. పద్యముల యొక్క ధారాశుద్ధి అచ్చులయు, హల్లులయు కలయికలోని యొక శ్రావ్యతయు మాధుర్య మనవచ్చును. కొంచెము కొంచెము వృత్త్యనుప్రాసము కలిసినచోఁ దెలుగుకవిత మధురముగా నున్నట్లు కనిపించును. ఈయన కవిత్వములో నీ లక్షణములన్నియు సమృద్ధిగా నున్నవి. ఈ కావ్యము జాగ్రత్తగాఁ బఠియించిన యెల్లరును నితని కవిత్వము మధురమైనది యనియే యనుకొందురు.

భావగతమాధుర్యమనగా చెప్పిన భావములు సర్వజనప్రియములుగా నుండుట. వానిలోఁ గొంత చమత్కారముకూడ కలిగియుండుట

"కవుల వీపులు బరువెక్కగా నొనర్చి
కానుకల నిడి సంతృప్తిగా నొనర్చి"

ఇందు చమత్కారము కలదు. మాధుర్యము కలదని చెప్పవచ్చు.

"గురువుగారి యమోఘతరమైన సాధన
వరమైన గొడ్డలి పచ్చిబలము"—

"కుస్తీల నెగ్గిన భీము చేతికఱ్ఱ"—

పచ్చిబలము, చేతికఱ్ఱ ఈ రెండు మాటలు ప్రత్యేకమైన భావముతో సమకూర్పబడి భావగత మాధుర్యమును సంపాదించుచున్నవి.

"ఇట్టి కంగారు నాకయయో రుద్దకు దుగ్ధసాగర
విహారా ! భక్తకల్పద్రుమా"

ఇచట సంబోధనలు లోకోక్తియు రెండును కలసి భావగత మాధుర్యమును సమకూర్చుచున్నవి.

"బ్రతుకుం జాలించినట్టి యే ప్రభునకొ ? తొలి
జ్ఞప్తికై శిలావిగ్రహాల్ గట్టి; నాడు
కొలిచినారలు నేడింత తలచినంత
వెలయు నిముసాన మా శిలావిగ్రహములు"

ఈ భావమునందు మాధుర్యము కలదు. ఇందాక్షేపణ యున్నదన వచ్చును. లేదా ప్రశంస యున్నదనవచ్చును.

"నీ పెదవులనుండి జారిన నవీన మరందము లారగింప నా
హృదయపు పాత్రలోన హృదయేశ్వరి ! నింపుము ప్రేమరాగమున్"
"చిరంత దిగంతదంతురోద్దంత యశః ప్రభూత"

ఇట్టి రచన నిస్సంశయముగా మధురమైనది. అందుచేత కవికోకిల యన్న బిరుదము సార్థకమైనదని చెప్పవలయును.

ఈ మాధుర్యము వట్టిమాధుర్యము కాదు. గడుసుతనముతోఁ గూడిన మాధుర్యము. అనగా నీ మాధుర్యములోఁ గొంత ప్రౌఢియుఁగూడ కలిసి యున్నదన్నమాట. ప్రౌఢి కలిసియున్నమాధుర్యము వట్టిమాధుర్యము కంటె గొప్పది.

"సింగమవై దగాబ్రిటిషుజిత్తులమారి సృగాలమున్ జగా భంగమొనర్ప లేపిన" ఇందులో దగా, జగా, యన్న రెండు శబ్దములు రచనకు ప్రౌఢిని గూర్చును.

"నా భ్రూసితభాగపుం బసుపుబొట్టు నపాకరణంబొనర్తువా"
ఇందు నోజోగుణముతోఁ గూడియున్న ప్రౌఢి కలదు.

"చెల్లెంబూర్వపు పాకడల్ విపులసచ్ఛ్రీభోగ భాగ్యాలు రంజిల్లన్ లావులులేవు నీ సుకవితోన్మేషంబు పెంపొంద నాస ల్లేవింతకు" ఈ చివరి ప్రాసమును కూర్చుట తెనుగుపద్యరచనలోని గడుసుతనము.

"మదీయాస్యగంధ మ్మాఘ్రాణము జేసి నా వచనముల్ దప్పైన దండింపవే" అన్న స్థలములందలి ప్రాస యదుకుట నెట్టిదో నిదియునట్టిద. మరియు నితడు పాండిత్య స్ఫోరకములైన పలు ప్రయోగములు చేయును.

"పులిభిన్నటన్ మెనవి" "భరతపౌరుషవ్యోమ శుంభద్ద్యుమణిరాంబు రాశి" ఇట్టి కూర్పులు కవితకు నడువు తెచ్చును. నడువులేని కవిత తేలి పోవును. ఇతడు భూమికలో కవిత్వమునుగూర్చి తనకు గల యభిప్రాయము నిట్లు వ్రాకుచ్చెను. కవిత్వమునకు గొప్పతన మాపాదించునది యనుభూతియే గాని మఱొండు గాదు. ఈ రహస్యము తెలిసిన కవి గొప్ప కవి కాకుండ నెట్లుండగలడు ?

"రెడ్డినాథుల కరుణార్ద్ర దృగ్విశేష
గాఢతర బంధురంబగు కంబమందు
వెలిగె నానాడు సుకవితోజ్వలపు దివ్వె" ఈ కల్పన మిక్కలి మధురముగా నున్నది. తెలుగుదేశాన తొలగిపోయిన యొక సంప్రదాయము. శిల్పమునందు మాత్రమే కనిపించుచున్న దీపస్తంభములు, దివ్వెలు మొద లైనవాని నాశ్రయించి కలిపించిన యలంకారము.

శ్రీనాథుని మొదలు సీసపద్య మొక యూపును తెలుగుబాసలో దెచ్చు నలవాటు కవులకైనది. మధురకవులని ప్రశస్తి పొందిన సర్వకవులయందు సీసపద్యములలో నీ యూపు కనిపించును. ఆ యూపు విలక్షణములయిన శబ్దముల కూర్పుచేతను, సీసచరణములో రగణ తగణ నలనగముల యధికమైన సమకూర్పుచేతను చరణాంతముయొక్క విరతిచేతను నాల్గు చరణములు నొకటే నమూనాగా వ్రాయుటచేతను సమకూడును.

"ఏమిగొప్ప సదస్సులో మానెడు వరాలు
కవికి తొల్లిట రెడ్డిదవు దొసగుట"

"ఇది త్రొక్కబడిన యస్పృశ్యజాతి గృహమ్ము
గడుసుబాపడు విందు గుడుచుటేల ?"

ఈమొదలైన సీసపద్యములే గాక ఎగురుచున్నది, పలుకుచున్నది, నడచుచున్నది, కులుకుచున్నది, ఇది యొక గణము. వెలిగించుకొన

పేయి, కట్టించుకొనవోయి, నడిపించుకొనవోయి, సాగించుకొనవోయి, ఇది యొక గణము. సీసపద్య ప్రతిచరణాదియందు నీ శబ్దములు నిక్షేపించుటచేత సీసపద్య మవొక నడక నడచును. నీ పూరికొంపలో, నీగర్భగోళాన, నీ రక్తనాళాల, నీ స్పృహాసాధాన, ఇవియొక గణము. చల్లారెనే, అణగారెనే, ఆగిపోయెనే, నశియించెనే, ఇది మఱొక గణము. ఇట్టివాని స్వీకరణముచేత సీసపద్య మొక నడక నడచును. ఆ సీసపద్యమున కొక సొంపు వచ్చును. ఇతని సీసపద్యము లన్నియు నొకానొక యిట్టి మెలపు నాశ్రయించినవే. ఈ కాలమునఁ జాలమంది యభిప్రాయము సీసపద్య మిట్లే యుండవలెనని. తక్కిన విషయ మెట్లున్నను సీసపద్య రచనలో నిట్టి మార్గ మవలంబించినవాడు మధురకవి యనిపించుకొనును,

ఈతని మాధుర్య సామగ్రి ఇతని ప్రౌఢి కొంత యున్నది. ఆ ప్రౌఢి చేతనే యితని కవిత యధికాదరణీయ మగుచున్నది.

"నన్నయ్య హృత్సీమ నట్టువఁ ద్రొక్కుచు
పూతగౌతమి గంగ నీతఁ గొట్టి"

"తొలినాటి తెలుగుపూవుల తోపులోన, న
న్నయ్య తేనెను ద్రావి యులరునాడు"

మొదలయినవి.

"ఢిల్లీకన్నులుఁ దేరుకొన్నయవి నీ తీవిం బ్రదర్శింప లాల్
ఖిల్లాపై జగజగ్గు బావుట సెలంగెన్ గప్రపుంబూలమై
జల్లెన్ హిందుధరాలలామయు నుపస్సంధ్యారుచిం దేలె మా
పల్లీపక్కణముల్ పురాతనపు సంపత్కీర్తి మాకబ్బుతన్"

"ముదురుకులాల సాంఘికపు మోసములో బడి గ్రమ్మగిపోయి పెన్
బదవలువడ్డ స్వీయకుల భారముఁ దోరము మోసినట్టి సా
హృదము గలట్టి దాత్మమణి వీవు స్వజాతిచరిత్రలోన నీ
కొదవు పసిండి పూజలు గుణోజ్వల భాసుర! దీనబాంధవా!"

ఇట్టి పద్యములలో కూర్చిన కూర్పు మాధుర్యమును దాటి ప్రౌఢివైపునకు మొగ్గుచున్నది.

ఇతని కొన్ని భావములు చాల విచిత్రముగా నుండును. ఆలోచనా పూరితములై యుండును.

"శాసనాల్వల్ల నీ నిందారూపకమైన భేదములు సంధింపంగ
ఏలున్నదే" శ్రీకృష్ణదేవరాయలవారిని సంబోధించుచు

"వర్ణాస కలంగి క్రుంగుటను న్యాయము నేడును గాక నీదు సంస్థానమునందు గూడ గలదా?" అని యడుగుచున్నాడు. ఇంకొక చమత్కారము.

"కాలికి గండపెండెరము గట్టిన నీ సముఖాన నేను భూ
పాలక యున్న గగ్గెరను పాదముకుం దొడగంగ నాస రా
జాలదు కాని నాకు నెద జక్కనికైత వసంతకాల పృ
క్షాల వసించు కోయిలల గానముఁ దీయగ నాస గల్గెడిన్"

చాలమంది కవులు తమ కాలికి గండపెండెరము కావలెనందురు. ఇతఁ డక్కరలేదనుచున్నాడు. వసంతకోకిలమువలె తాను పాడుకొనుటయె తనకు జీవిత పరమార్థముగా భావించుచున్నాడు. నిజమైన కవి యొక్క లక్షణమిది.

ఇతని కవితలో సర్వత్ర తన కులము తన పేదతనము రెండును తల యెత్తి చూచుచుండును. ఈకాలపు కవులకు ఈ వర్ణమునందు పుట్టిన కవులకు నిదియొక లక్షణమేమో యని యనిపించుచున్నది. చాలమంది కవులు తమ దారిద్ర్యమునుగుఱించి వ్రాసికొందురు. వా రన్నివర్ణములయందునను గలరు. తన వర్ణమునుగుఱించి ఈ వర్ణములో జనించిన కవులు వ్రాసికొనుటయుగూడ సహజమె. కాని తన వర్ణములో నీకాలమున తనవంటి సత్కవు లెంతమంది పుట్టినారు? ఈకాలము తన జాతి కళంకము నెంత తుడిచివేసినది? తెనుగు సరస్వతి తన వర్ణమువారిని వచ్చి యాశ్రయించినదా యన్నట్లున్నదే. అట్టి భావము లీ కావ్యమునందు లేవు. పూర్వకాలపు టాచారములు, పూర్వకాలపు తమ దుఃస్థితిని పొగడుట గలదు. నేటి తమ చాలవరకు బాగుపడిన సుస్థితిని భావించుటకూడ యీ కవియందు గలదు.

"ఇది దేవళము ముఖమ్మింత చూడని జాతి
సారిది గర్భపుగుడిన్ జొచ్చుటేల?

ఇది తరాలకొలంది చదువెఱుంగని యిల్లు
చిన్నారి వాణి వసింపనేల?
ఇది యేలుబడి సేయ నెపుడు కోరని జాతి
పాలించు మంత్రిత్వపదవి యేల?"

ఈ పద్యభాగము తన కృతిభర్తయైన శ్రీ సంజీవయ్యగారిని మెచ్చు కొనుటయేగాని నిజానకు దేశము పొందిన సౌభాగ్యముగాదా! ఈ సంగతిని కూడ ఈ కవి గుర్తించియే వ్రాసెను. ఇంతమాత్రమే కాదు. ఈ కవి గ్రామము బొబ్బిలిపద్ద నున్న పల్లెటూరు (పెద్దపెంకి) బొబ్బిలినిగుఱించి పద్యము లిందున్నవి.

"సేనావ్రజమ్ము ఖడ్గాన వైరులఁజంప
తనువున వీరగంధంబు పూసి—
..........................................
విశ్వరంగమున పేరుగాంచి నెలంగు మేలి
సిపల కిరవైన బొబ్బిలిపురము నాది"

అని యీకవి గర్వపడుచున్నాడు. ఆ తనువున వీరగంధమునుఁ బూసినవారిలో వీరభటులై యితని పూర్వులు లేరని యెటుల చెప్పగలము? ఆనాడు హరిజనులు శాంతివేళల పొలము దున్నినవారు. యుద్ధవేళల కత్తి పట్టినవారు. నిజానికా, కాలమును నీకాలము సరిగా నర్థముచేసికొనలేదు. ఇతని బొబ్బిలి పులిపౌరుషసాహిత్యము, మిక్కిలి గొప్పది.

"కత్తుల సాము సేతను
వల్లమాలిననాటి చిల్లపెంకు"

బొబ్బిలిలో నొక బావి యున్నదట. ఆ బావినీరు, ప్రక్కనున్న చిల్ల పెంకులపై బడినచో నా రెండు చిల్లపెంకులు దెబ్బలాడుకొనెనట. ఇది కథ. తరువాత ఫ్రెంచివారు దానిని పూడ్పించినారట. అధునాతనవిద్య వ్యాపించక పూర్వము తెలుగుదేశాన పల్లెపల్లెలో పసిబాలురీ కథను చెప్పికొనెడువారు.

"కలహక్షోణినిఁ గూలియున్న పృతనాకంకాళముం గాంచి పొం
గులు వాఱన్ దనువెల్ల వీరరసమున్ ప్రోద్ధతిన్ వాడి ర

వ్వల బాకున్ ఝలిపించి శాత్రవుల గర్భంబందుఁ బన్నుండు పె
బ్బులి మా పాపయసంచరించిన పొలమ్ముల్ గాఢశంసార్హముల్''

ఈ పద్య మితని స్వగ్రామాహంకారమున కుదాహరణము. ఈ పద్య రచన యితని కవిత్వమునకు మచ్చుముక్క. పృతనా కంకాళము సేన యొక్క శవము అనగా సేన సర్వము చనిపోయె నన్నమాట. భిన్న వీరుల భిన్నకంకాళములు గావు. సేన యంతయు నొకటే శవముగా గన్పించు చున్నది. ఇట్టి సమాసము చేయుటకు గాఢమైన కవితాశక్తి కావలయును.

'శంసార్హముల్' ప్రశంసాశబ్దము బదులు శంసాశబ్దము వాడెను. నిరుపసర్గముగా నిట్లు వాడుట క్వాచిత్క మైనది. ఇది ప్రౌఢికి యుదాహరణము. "శాత్రవగర్భంబందుఁ బన్నుండు" తెలుగు దేశములో విరోధితో "ఓరే నీగుండెలో మేల్కొంటాను" అనుట లోకోక్తి. శత్రువును నిద్దుర పోనీయ ఁనన్నమాట. ఇచట గర్భంబందు పన్నుండుట ఆ లోకోక్తిని స్ఫురింపజేసి భావ పోషణము సేయుచున్నది.

ఇతని కవిత్వము పలుచోట్ల నీ దృశమైన కవితా లక్షణములు గలిగి రమ్యముగా నున్నది.

"వానకై గూడు కట్టుకోలేని పన్ను"

ఇందు తన దారిద్ర్యము చెప్పు చున్నాడు. కాని చెప్పుటలో నెంత రమ్యముగా చెప్పుచున్నాడు. తానొక పక్షి. తానొక గూడైన కట్టుకొన లేడు. తన నిస్సహాయత్వము దీనియందు వ్యంగ్య మగుచున్నది.

ఇంతవర కితని కవికోకిల, లక్షణము చెప్పబడినది. ఇతని కవితా విశారద బిరుదమును విచారింతము. ఈ బిరుదమునకు రెండర్థములు. కవిత్వమును వ్రాసెడు మార్గము సర్వాంకషముగా తెలిసినవాడు అని యొక యర్థము. ఈయర్థ మిదివరకే నిరూపితమైనది.

రెండవ యర్థము పలువిధములైన కవితా మార్గములు తెలిసిన వాడు అని రెండవయర్థము చెప్పినచో ఆ యర్థముగూడ నితని యందు పొసగుచున్నది. ఈ కావ్యమునందు రకరకములైన శీర్షికలు గలవు. దేశనాయకుల గురించి కొన్నిపద్యములు, కవిత్వమును గూర్చి కొన్ని

శీర్షికలు, వచ్చిన స్వాతంత్ర్యమును గూర్చి కొన్ని శీర్షికలు, పూర్వకవుల గురించి కొన్ని శీర్షికలు, ఆంధ్రదేశమును గూర్చి కొన్ని శీర్షికలు. 'ప్రభూ' అన్న శీర్షిక యొకటి. ఇది యొక విచిత్రమైనది. ఈ శీర్షికలో కవి తన భక్తి భావమును చెప్పినాడు. అతని దైవమేసుక్రీస్తు. అతని మోక్షము పరమైను ఆది యట్లుంచి

" మిణుకు మిణుకని మెఱసెడు కునుకు దీప
మే - మదీయ కుటీరాన మేళవించి
నన్ను నోదార్చు చున్నవన్నా! పరేశ! "

" పాత్ర కొక జేస నా కుక్కపడక కేది
జేన? దీనజనావనా! అనతిమ్ము "

ఇచట దేవు డేసుక్రీస్తుగాని భావనామార్గము భారతజాతీయము. ఇంగ్లీషు భాషలో Lyrics కలవు. వాని పద్ధతిక దీనికి భేదము కలదు. ఇది భారతదేశస్థుని రచనా పద్ధతి. బైబిలులో నున్న కీర్తన గ్రంథ వైఖరిగూడ నీ మార్గమున బోదు. ఇది యొక మార్గము. భక్తిమార్గము. మరియొక మార్గ మేమన కలువరింత—ఇది ఓమార్ ఖయ్యాము మార్గము. ఆ పద్ధతిలో (దీనిని కొందరు మర్మకవిత్వమనుట కలదు Mystic Poetry) వ్రాసిన వారు నేటి తెలుగుదేశాన చాలమంది గలరు. వారిలో నుత్తమోత్తము మైన రచన కీ రచన యేమియు తీసిపోదు.

పూర్వ చరిత్రలో కొన్ని ఘట్టములు చాల రమ్యముగా వ్రాయబడినవి. 'రాణీ సంయుక్త' తన తండ్రితో చెప్పిన మాటలు "హితబోధ" యన్న శీర్షికలో వ్రాయబడినది. అందులోని మొదటి పద్య మిది.

" మనలోనే కలహాలఁ బెంచికొని మోమాటంబు పోనాడి గుం
డెను కొండంబలె జేసి శాత్రవులతో ఢీకొన్న రీతిస్ బలా
లను కోపాలనుఁ బెంచుకొన్న నిది ధర్మంబౌనె? తండ్రీ! క్షమిం
చిన నేపాటిది నీకు నాకొఱకు నీ చివ్వన్ విసర్జింపుమీ! "

ఈ పద్య మేమిపద్యము? పరమధ్వనిపూరితముగా నున్నది. దేశీయు లొకరితో నొకరు పోరాడుకొనుట యెంత దుష్టమో యెత్తి చూపించుట

యుట్లుండగా శత్రువులతో డీకొన్నట్లు మనలో మన మొకరితో నొకరు డీకొనుట యన్న భావము మిక్కిలి హృదయంగమముగా నున్నది.

"పటువైశద్య విశాల భావకవితా వ్యాసర్షు లున్నారలు
త్కట పాండిత్య వియత్తలాపగ మహాగంభీర వీచీ సము
త్కట డోలాళుల నూగు వారలును నీ దర్బారునం దుండి రే
మిటికో ? పెద్దనగారి కట్టి గగ్గెరను మెల్మిన్ వేసితో భూపతీ"

ఇట్లే చాలమంది యనుకొందురు. స్థూలదృష్టికి పెద్దనగారి గొప్ప తనము తెలియదు ఈ పద్యమును వ్రాసిన దందులకు గాదు. వ్యాజముగా పెద్దనగారి గొప్పతనము చెప్పుటకే.

ఈ గ్రంథమున నింక ననేకములైన రమణీయ విషయములు చూపించవచ్చును. ఇతడు మతముచేత క్రైస్తవుడు. కాని భారతీయుడు. ఆ భారతీయ లక్షణములు పోవు.

"విజయుడ నిన్ను గెల్చుట భళీ! యివి కర్మ నిబద్ధజాతకాల్"

ఈ భావము క్రైస్తవమతములోనిది గాదు. భారతదేశములో పుట్టిన లక్షణ మిది. నిన్నటి మొన్నటివరకు వీరి పూర్వులంవరు హిందువులై యున్న లక్షణమిది. ఆ లక్షణమే ఈ కవియొక్క యాంధ్ర కావ్యమునకు శోభ దెచ్చుచున్నది.

"అఖిల భారతమునకు దివ్యామృతంబు
పేపి రక్షించు గోమాత"

ఇదియును భారతజాతి లక్షణమే. ఈ మాటకు కోపము వచ్చినచో నివి ఆ శీర్షికలో మాటాడువారి భావములు కాని నావి కావని సమాధానము చెప్పవచ్చును. ఎంత చెప్పినను వాని వాసన లేదనుటకు వీలులేదు.

ఈ రీతిగా నితడు గొప్ప కవియని, నిరూపితమైనది.

"ఇది సిఫారసులోకమ్ము ముదిమి బట్టి
మూల పడుటకు నింకెన్ని పుష్కరములు
జరుగ వలయునో"

ఇది యీ కవియొక్క యాధునిక లోకముయొక్క విమర్శ. ఈ స్థితి యిట్లే యున్నచో నిస్సంశయముగా నీ దేశము పాడైపోవునని యాతని సిద్ధాంతము. ఇతడు కవి. ఈ కవితా సంస్కారము బహుజన్మల దని యితని తాత్పర్యము. తాను కవి యగుట తన జన్మ చారితార్థ్యమని భావించువాడు.

" నన్ను వరించి వచ్చె నొకనాటిప యీ కవితాలలామ పె
గ్గస్న కళావిభాసిని, జరామరణంబులు లేని వాణి పొ
మ్మన్నను పోని కన్యక, నితాంత యశః కలితాభి రామ సం
పన్న తెనుంగు శారద శుభంబిక జన్మము ధన్యమయ్యెడిన్ "

ఈ కావ్యమునందందు దోసములు లేకపోలేదు. వానిని గూడ క్రమముగా తొలగించుకొని తనకు సహజముగా సిద్ధించిన యీ కవితా కళకు సౌధమువంటి మహాకావ్యము వ్రాసి మహాకవి యవుగాతమని యితని నాశీర్వదించుచున్నాను.

విజయవాడ
9 - 10 - 55

విశ్వనాథ సత్యనారాయణ, ఎం.ఏ.

# భూమిక

రసజ్ఞ పాఠకలోకమునకు :

మహోజ్జ్వలానందాతిశయ మధుర శుభవేళాఘంటీ కలరవళిలో నవ్యాంధ్ర రాజ్యలక్ష్మి నీరాజనమందికొన్న నాటికే నా యీ "పాంచజన్య" ఖండకావ్యకృతి ముగిసినది. సమాదరణము లభింపమికి వట్టిచేతులతోనే యా దివ్యాంధ్రరాష్ట్ర జననికి ప్రియమారఁ బూజ గావించి నా ఋణమును దీర్చుకొంటిని.

తొలి ఖండకావ్యము "వసంతగాన"మేనాడో యచ్చుపడి కొలఁది దినాలలోనే యమ్ముడుపోయినది. మఱల నేటి దాక నది ద్వితీయజన్మ మెత్తలేదు. ఆ జన్మమెత్తుటెప్పుడో ?

విజ్ఞులైన రసజ్ఞుల సమధిక సమాశ్రయ మున్నచో మఱల నుద్భవము నందునేమో ?

విశ్వతో ముఖముగా ననంతరూపములతో నృత్య విన్యాసము గావించు చున్న నేటి సాహితీ కళారమకు నమనమములు ఘటించి కవికుల జమా బందికి నీ నా "పాంచజన్యము" కూడ నొక శరచ్చంద్రిక కాగలదని నా లిప్స.

ఇందులో కొన్ని రచనలు కళాపిపానువులకు బరిచితమైనవే. "విశ్వ భారతి" రచన నేనాడె హిజ్‌మాష్టర్‌వాయిస్ గ్రామఫోను కంపెనీవారు రికార్డుగాఁ దీయించిరి. సంక్రాంతిసందేశముగా నాలిండియా రేడియో (విజయవాడ) వారి సౌజన్యముతో నాటి సంక్రాంతిదినమున స్వీయ కవితా పఠనముఁగావించిన రచన లానాడ ముద్రితమైన యీ పాంచజన్యము లోనివే. కనీసము సానుభూతినందని తెలుగు కవనకళ రాణించుట దుర్లభము గదా ! రచనలు వేనవేలు. ఎవనివారి వానిది. కాని కవిత్వమునకు గొప్ప తన మాపాదించునది యనుభూతియేకాని మఱొండుకాదు. కావుననే మహా కవి కాగలిగినవాడు హృదయమున విశ్వోన్మీలనమైనవాఁడుగా నుండవలెను. ఈ విశ్వోన్మీలనము పరమేశ్వరుని కరుణవలన గలుగును. ఆ పరమేశ్వరుని రూపమే ప్రతిభ.

వేఱొక మనవి :

ఈ నాకృతిని గౌరవనీయులు, దీనజనబాంధవులునైన మ॥రా॥రా॥శ్రీ దామోదర సంజీవయ్య బి.యె.బి.యల్. మంత్రి శిఖామణులకు నంకిత మిచ్చితిని. శ్రీవారి కుటుంబమునకుఁ బరమేశ్వరుఁడితోధి కైశ్వర్యారోగ్యము లిచ్చి సాకుత!

ఎన్నియో గండముల నధిగమించి నేఁడీరూపముదాల్చిన యీ నాకృతి స్వరూపమును మున్ను తిలకించిన కవితావతంసులు నాంధ్రరాష్ట్ర శాసన సభాసభ్యులు, మిత్రులు శ్రీయుతులు, పాల వెంకటసుబ్బయ్యగారు నన్ను కొండొకవడి కడపజిల్లా యాదర్శకగ్రామమైన మంటపంపల్లి వాస్తవ్యులును, "శీలవతి" కావ్యభర్తృత్వము వహించిన శ్రీమంతులు, రెడ్డికులసంజా తులు, శ్రీ పుట్టమరెడ్డి రమణరెడ్డిగారి దర్శనము సేయింప శ్రీ రెడ్డిగారు నా కావ్యము సాంతముగా విని ముద్రింపించుటకు వలయు విత్తము నయాచిత ముగా నిడి వారి మహోదారస్వభావమును వ్యక్తముజేసిరి. శ్రీ రెడ్డిగారికి నా నమస్సులు.

మిత్రులు శ్రీ పాల వేంకటసుబ్బయ్యగారిమీద జెప్పికొన్న పద్యమిట నుల్లేఖించుట తప్పు గాదనుకొందును.

"చటులౌజ్జ్వల్య కళాసుధానదన! భాషాదేవి మస్తంబునన్
పటు చైతన్యవినూత్నభావ సుమపున్గబ్బాలఁ దాల్పించి, సం
కటముంబడ్డ కులమ్ము మేలుకయి దీక్షంబూను, మా " పాల వేం
కటసుబ్బయ్య " కవీడ్గజేంద్రమునకుం గైమోడ్పు లర్పించెదన్ "

కాకినాడ
29-4-55

జ్ఞానానందం

# నమస్సులు

౧

పుట్టమ రెడ్డివంశమున బుట్టి, జగజ్జయులైన రెడ్డి న
గ్రమాట్టుల ప్రాజ్యవైభవనిరర్గళకక్రమ విభూతికిన్ జగా
పట్టయి, యార్తమానవుల ప్రాపయి; ధర్మగుణాలకెల్లఁ బె
ర్వెట్టిన నేతకున్ రమణరెడ్డికి దాతకు నా నమస్సులౌ.

౨

నిర్వృతినిర్వాత సంనిర్భిన్నమౌ కళా
మంజువాణికి దొడ్డమహలు గట్టి
గృహపరిశ్రమఁ బేర వృత్తిగల్పన సేసి
గతిలేనివారికి మెతుకు వెట్టి
దయవారప్రథిత మాతాశిశు రక్షణా
ర్థముకయి వేలువందల వ్యయించి
గొలగొలమని దిగుల్గొను జాతి కష్టాల
నిచయమ్ముఁగాంచి కన్నీరునించి
సర్వ భోగరాశిసదనాన గలిగియు
నణువునైన నందు నంటుకోక
బ్రతుకు పరులకొఱకు "రమణరెడ్డి" జమీను
దారు శుభములంది తనరుగాక!

3

ఏమిగొప్ప? సదస్సులో మానెడువరాలు
కవికి తొల్లిట రెడ్డిధవు డొసగుట
నేమివింత? జగమ్ములో మాన్యమౌకృతిఁ
గొని మున్ను రాజు భూధనము లిడుట

ఏమివిశేషమ్ము? శ్రీమహత్వకవిత్వ
రసనిద్ధికొక రాజు వసువులిడుట
ఏమిరసికత? సభామంటపమున, పూ
ర్వమొక రసజ్ఞుండు ప్రస్తుతింప
పాషణమున తెనుగుభాషణమ్ము రహించె
మునుపు రాచరికము మనుట కతన
రాచరికము లేని రమణరెడ్డి త్వదీయ
కరము నేడు కవికి కల్పవల్లి.

౪

కళకాధారము లేని కాలమున
నా కావ్యమ్ము ముద్రింపగా
వలెనన్నట్టి భవన్మృదూక్తులకు
నా స్వాంతంబు రంజిల్ల, చే
తలు చేయంగను నిన్నుబోలు రసికోత్తంసుల్
మహాంధ్రావనిన్
గలరే? నూటికి కోటికొక్కరు,
నమస్కారమ్ము రెడ్డ్యగ్రణీ!

౫

రెడ్డినాథుల కరుణార్ద్ర దృగ్విశేష
గాఢతర బంధురంబగు కంబమందు
వెలిగె నానాడు సుకవితోజ్జ్వలపు దివ్వె
వెలుగుగాత నేడును తదుజ్జ్వలపు దివ్వె"

24-4-55
కాకినాడ

జ్ఞానానందము

# అంకితము

౧

శ్రీ దామోదరవంశ భూషణము ప్రస్ఫీతోత్కళా శ్రీ రసా
స్వాదుండాఢ్యగుణైక చిత్తుఁడు, జగాసన్న్యాసి శ్రీ గాంధి సూ
త్రా దర్శోన్నతభావపున్ శిఖర మార్గాలంబి ! నాకావ్య ల
క్ష్మీదేవిన్ గరమందె ; మా సచివ సంజీవయ్య ! ఆనందమున్ ”

౨

“ ఇది నా కూఁతురు “ పాంచజన్యము ” కళాహారాళి సల్లక్షణా
భ్యుదయౌద్ధత్య రసస్వరూపిణి, గుణాంభోరాశి ! సన్మార్గపున్
జదువు న్నేర్చిన కన్య కోరెమది నానందంబు పొంగార, మె
చ్చెద వీవంచు రసప్రియా ! సచివ సంజీవయ్య ! నిన్ను న్వెసన్’

౩

నీ సుగుణాలు నీ ప్రశుభ నిర్మల దివ్యమనోజ్ఞ మంజు సు
శ్రీ సముదీర్ణ భావములు చెప్పినవెంటనె గాక నీకళా
భ్యాసము నీదు జాలిగల స్వాంతమునం గనిపెట్టి నీదు సా
వాసముఁ గోరుకొన్న యది పండిత ! యెట్టుల నాదరింతువో ?

౪

ధ్వనియించినది ప్రతిధ్వను లీన నాంధ్రాన
నీ జయారంభవాణీ రవమ్ము
వెలిగించినది యశః కులకాంత రాజాజి
మంత్రిత్వమున నీ సమత్వదీప్తి
పరిమళించినది తపస్వి గాంధి యుగాన
దయివార నీదు మేధాప్రసవము
నడిపించినది త్రివర్ణ ధ్వజచ్ఛాయలో
దిగులొందనట్టి నీ దేశభక్తి

పట్టి పేదవారి వాకిండ్లు సూడగా
అరుసమందినది త్వదాత్మ నిజము
మాననీయ ! మహిత మంత్రి సంజీవయ్య
ఈ సుకృతి కుమారి నేలుకొనుము.

౩

జాతి శ్రేయముఁగాంక్ష సేసి పలు కష్టాలంది కాంగ్రెస్సు, సే
వా 'తర్పితునఁ' బెర్గి దేశజన సుస్వాంతాల నానందపున్
జ్యోతుల్ వెల్గయతించు నీ యతనముల్ వ్యూహాలు చోద్యాలు, నీ
ఖ్యాతింజాటెడి విశ్వమందు సుయశస్కా ! మంత్రి సంజీవయా !

౬

నీవెగా గుజరాతు నేత మోహన దాసు
బాటలో గళమెత్తి పాడినావు
నీవెగా జాలిగుండియ కల్గి పేదల
కడగండ్లఁగని నీరుఁగార్చినావు
నీవెగా గ్రామాల నెగడగాఁ బనిచేసి
సహకారభావమ్ముఁ జాటినావు
నీవెగా మంత్రివై నీరసించిన జాతి
కాలంబమిడి జోతలందినావు
నీవెగా మేలి సచివ మనీషిపదముఁ
దాల్చినావర్హతా ఘనస్థానమంది
నా వరాలకూచి కవితా శ్రీ వధూటి
నీవు నా జాతియనఁగఁ బొంగినది బాబు !

౭

నలభైయేండ్ల తపస్సుకున్ ఫలిత మీ నవ్యాంధ్రరాష్ట్రమ్ము, రా
ముల దీక్షావిభవానఁ దెల్గుల శుభంబుల్ మొగ్గలై పూవులై
ఫలియింపంబడుచున్నవేళ ; తొలి మావంశపు పుణ్యాన రా
జిలినావయ్య ! తెనుంగు మంతిరిగ సంజీవయ్య ! చిత్రంబగున్.

౮

కినమసలు పడిన పేదల
యుసురులలో వ్యథలఁబడుచున్న తలంపుల్
వసిగట్టి నసిగఁ జూచు, త
వ సుహృద్భావము నిజమ్ము ప్రణుతింపఁదగున్.

౯

గుడిసెన్ బుట్టిన యాదిమాంధ్రునకు మేల్కొల్పు న్నిరీహన్ గడుం
గడు వృద్ధుండు క్షమాప్రవాసి యగు శ్రీ గాంధీయొకం డెప్పుడో
జెడఁగున్ శంఖమునూదఁ దత్స్వనపుటావేశాన స్వాతంత్ర్యపై
నడుమున్ గట్టిన జాతి నాయకుఁడవన్నా ! నీకు బ్రహ్మాయువౌ.

౧౦

ఇది త్రొక్కఁబడిన యస్పృశ్య జాతిగృహమ్ము
    గడునుబాపఁడు విందుఁ గుడుచుటేల ?
ఇది దేవళపు ముఖమ్మింత చూడని జాతి
    సొరిది గర్భపుగుడిన్ జొచ్చుటేల ?
ఇది తరాలకొలంది చదువెఱుంగని యిల్లు
    చిన్నారివాణి వసింపనేల ?
ఇది యేలుబడి సేయనెపుడు కోరని జాతి
    పాలించు మంత్రిత్వ పదవి యేల ?
ఘనుపు కాలసృష్టి మోసాన హరియించె
నా కులంపు సత్తి నాడెములను
మఱల నేడొసంగె మంత్రి సంజీవయ్య !
సృష్టి మర్మముల గ్రహింపఁదరమె ?

౧౧

బలకాయించి మహానుభావుఁడు ; దయావారాశి ! బాపూజి వా
క్కులకామోదము సూపి తద్విధము నీకున్ గల్గు సర్వస్వమున్

బలిగావించి స్వదేశమున్ గొలుచు నీ నైర్మల్య భావానకున్
తెలుఁగున్ జాతికి మంత్రి ! పూజలివె సంజీవయ్య ! విద్యాఖనీ !

౧౨

ముదుసుకులాల సాంఘికపు మోసములోఁబడి క్రుగ్గిపోయి పెన్
బదవలువడ్డ స్వీయకులభారముఁ దోరము మోసినట్టి సా
హృదముఁ గలట్టి దాతృమణివీవు ; స్వజాతి చరిత్రలోన నీ
కొదవు పసిండిపూజలు గుణోజ్జ్వల భాసుర ! దీనబాంధవా !

౧౩

ఈ చిన్నికొంపలోనే జన్మమెత్తిన
మా యరుంధతి లోకమాన్యయయ్యె
ఈ లేమియింటిలోనే యల్ల శబరమ్మ
పట్టాభిరాముని ప్రణుతులందె
ఈ వంగడంబుననే శౌర్యనిధియైన
కన్నమనీడు ప్రఖ్యాతి దనరె
ఈ దీనజాతియందే బాలయోగి ని
శ్చలతపస్సు జగమ్ము నలరజేసె
పౌరుషమున బ్రతికి బట్టగట్టిననాఁటి
సిరిజనుండు నేడు హరిజనుండు
పూర్వసుకృతి మణులఁ బొలుపారుఁగావుత
సుజన వందితా ! హరిజన మంత్రి !

౧౪

కొనకొని తేనెలూర రసగుంభనపుంబలుకుల్ రహిం గల
మ్మున నరిపోహణింతువు, ప్రభూతపురాకృత పుణ్యమున్ గత
మ్మున ; నిను వాణియు న్వలచెఁబో ; నిను లక్ష్మి వరించెఁబో ; యశ
మ్మున నలరారు మింక గుణపుంజ విభాసి కళాభిరంజనా !

౧౫

కట్టా! దిక్కులు కండ్లుమూసినను పక్కా నీలమేఘాలు పెన్
పట్టంబై గగనమ్ము నిండిన మహౌదార్యస్వరూపమ్మునన్
జుట్టాలైనటువంటి పంచములకున్ దోసాన భూదానపున్
పట్టాలిచ్చిన నీ చరిత్రకు దయాబంధూ! నమోవాకముల్.

౧౬

తొలిగా మంత్రివై తెలుంగు జగమున్ దోరానఁ బాలించు ధీ
గల నీకున్; కవిగా తెలుంగు జగతిన్ గాల్పెట్టు నాకున్ మహో
జ్జ్వల సంబంధము నిల్పుకోగ బుధి నస్మత్ కావ్యకన్యామణిన్
చెలువ న్నీకు నొసంగితిన్ ప్రెగడ! సంజీవయ్య! కైకోగదే ?

౧౭

కవిలోకమునకు నగ్రణి! కవిసమ్రాట్టు
విశ్వనాథుని కృపావిభవమంది
తెలుగు నాయకుఁడు నా కళ మెచ్చుకొన్నట్టి
కాళేశు నిండారు కాన్కలంది
గొనబార బెజవాడ గోపాలరెడ్డి మం
జుల భావనిపుణు మెప్పులను వడసి
శైరీష కుసుమపేశల సుధాకవిమూర్తి
జాషువసుకవి ప్రశంసలంది
నా సువర్ణసుస్నిగ్ధ రత్నాలవల్లి
పున్నమ హసించు కడగొట్టు కన్నబిడ్డ
కావ్య సుకుమారి కీర్తిని గంపకెత్తి
వచ్చెనిదిగో! దామోదరాన్వయ విభూష!

౧౮

పెఱువుల కాలమందు కవివీరులు బువ్వకు లోటులేక, తా
ము, బహు మహోల్లసిత పుస్తకముల్ రచియించినారు, నేఁ

డు, ఐబువులన్న మంత్రులై, కడుంగడునందు గవీంద్రుఁడీవు పై
కుబకని విద్వదీడ్యచరితోత్తమ ! నన్ను ననుగ్రహింపుమీ ?

౧౯

“సరదాగా సరసంబుగాఁ గవనమున్ సాగించు నీ శక్తికిన్
గరువించు న్నిఖిలాంధ్ర భూమిసుయశస్కా ! పాండితీ శ్రీధురం
ధర ! విద్వజ్జనభూష ! దీనజనవంద్యా ! దానధౌరేయ ! మం
తిరి సంజీవ సమాహ్వయా ! శుభము ధాత్రిన్నీకు దీర్ఘాయువౌ ?”

౨౦

నీకారోగ్యము నీకుటుంబమునకున్ నిండారు సౌఖ్యాలు, సు
శ్రీ కళ్యాణపరంపరల్ గలుగు మంత్రీ ! జాతిసంసేవలో
ఢోకా లేని యశమ్మునందితివి యీడుంజోడు లేనట్టి నీ
ప్రాకట్యంపు గుణాలకున్నతులు భాస్వత్కీర్తి! విద్వన్మణీ.

౨౧

కళలు వెలయునట్టి గ్రామరాజము మీది
“ పెద్దపాడు ” నాది “ పెద్దపెంకి ”
పిల్ల నిచ్చినాడ నిల్లాలుగా నీకు
మంచివాడవంచు మంతిరయ్య !

జ్ఞానానందం

# విషయసూచిక

# విశ్వభారతి

౧

ఎగురుచున్నది జగా మగరాల తొలిసంజ
కళ లీను మూఁడు వన్నెలపతాక
పలుకుచున్నది ముని బ్రహ్మ మోహనదాసు
శాంత్యహింసలమహాశక్తివాణి
నడచుచున్నది ప్రాక్తన న్యాయనైపుణ్య
సత్క్రళాధర్మ యోషాలలామ
కులుకుచున్నది మొన్న తెలవారిబంధాలు
సడలించుకొన్న స్వేచ్ఛాపురంధ్రి
శుభకళాంకిత విజయవిస్ఫుః విశాల
నవ్యభారతదేశ శృంగార కలన
పాడుకొనవోయి! గొంతెత్తి నేఁడు తెన్స
క్షితి నభమ్ముల మ్రోఁగ భారతకుమార!

౨

వెలిఁగించుకొనవోయి! విశ్వభారతకళా
కాంతివిజ్ఞానంపు కాగడాలు
కట్టించుకొనవోయి! యిట్టి స్వేచ్ఛాగృహ
ద్వారాన స్వాతంత్ర్యతోరణాలు
నడిపించుకొనవోయి! నవ్యస్వరాజ్య దీ
ర్ఘమార్గమునను స్వేచ్ఛారథాలు
సాగించుకొనవోయి! శ్రీగాంధి సలిపిన
జమ లేని మహదహింసావ్రతాలు
పాడుకొనవోయి! నీజాతి భవ్యగీతి
నిలుపుకొనవోయి! జాతి నిర్నిద్రకీర్తి
దెసలు మార్మ్రోగ నీపేరుఁ దెలుపవోయి!
బ్రతుకు కొండంత కలిగిన భారతీయ!

## కావ్యకన్య

నన్నయ్యహృత్సీమ నట్టువఁ ద్రొక్కుచుఁ
బూతగౌతమిగంగ నీతఁగొట్టి
తిక్కన్నయజ్ఞవీధిని గాంచి మోదించి
తెలుఁగువారల దొడ్డకొలువు లంది
కవిరాజు కావ్యశృంగార కళావతీ
నాట్యంబులోని విన్నాణ మెఱిఁగి
భక్తు లౌ బమ్మెరవా రింట మధురాతి
మధురభక్తి రసంపు సుధను గ్రోలి
హంపి విజయనగరమందు రాయలవారి
యష్టదిగ్గజముల నలరఁజేసి
విజయభేరిఁ గొట్టి పృథివిదేవత మెచ్చ
తెలుఁగు కావ్యకన్య వెలయుఁగాక!

---

## దోసిలి

౧

తెలుగుంగబ్బములల్లునట్టి కవులీదివ్యాంధ్రభూమిస్థలిన్
కలవారెందరొ? వారు నీకుసములా? కావ్యప్రపంచాన నీ
కలమెన్నోవిధముల్ జరించెడిని విఖ్యాతిం బ్రదర్శించెడిన్
బలుకన్ నీకును నీవెసాటి గురుదేవా! సత్యనారాయణా!

౨

కలముంగైనిడి వ్రాయనెంచెదవ గంగావాహినీ ధార లు
జ్జ్వలమై పాఱువిధాన నీదు రచనా సామర్థ్య వైశద్య ప్రో
జ్జ్వలధారా సముదాయమట్టులెగదా! పాఱున్ యథార్థంబు ప
ల్కుల రాణిన్ వలపించు బ్రహ్మవు సుధోక్తుల్ నీ మహావాక్యముల్.

౩

సకలాంధ్రమ్ము నమస్కరింపగ మహాసాహిత్య లోకైకభూ
ష ! కవీశానులు, భూమినాథులు త్వదీయంబైన మాధుర్యమం
జు కథాగీతుల కంజలింపగ యశస్స్ఫూర్తిన్ విడంబింప వి
శ్వకవీంద్రా ! మదహస్తి నెక్కితివి హర్షధ్వానముల్ మ్రోగగన్.

౪

తెలుగువారల గుండె లలరింప మృదుకావ్య
నిర్మాణచణుఁడవై నిలిచినావు
సరసమరంద నిష్యందమాధుర్యాన
విమలశబ్దములఁ బొసంగించినావు
బలులైనజాతి జోదుల వీరగానమ్ము
తెలుగువీధిని బాడి కులికినావు
తెలుగుభాషా మహారాజ్యాల దివ్య వారాశిఁ
గొంగ్రొత్త రచనలఁ గూర్చినావు
ఐకమత్యంబు లేని యీ యాంధ్రజాతిఁ
గాంచి మేల్కొల్పి శ్రావ్య సత్కావ్యగాన
మాలపించిన నీకు జోహారులిడని
యనుఁగు తెనుగన్న లేడు నీ యాంధ్రసీమ!

౫

కమనీయార్థ రసావతారధిషణా గంభీరమూర్తీ ! దయా
సముద్రా ! వివిధార్థ కావ్యరచనా సామ్రాజ్య పట్టాభి షి
క్త ! మహాంధ్రాభ్యుదయాభిమాని ! విలసద్బ్రాహ్మీస్వరూపా !
గుణోత్తమ ! యౌదార్య రసస్వభావ ! గురునాథా ! విశ్వనాథా ! నమః

---

# బొబ్బిలి

౧

మల్లమ్మదేవి శుంభత్పౌరుషమును గా
డెలఁ బోయఁ బెద్ద తూములను గొలిచి
రంగరాయని రణరంగకేళీశస్త్ర
రాజనమ్ముకుఁ గసంత్తు నేర్పి
పాపరాయని బాహువైఁ జిందులను ద్రొక్క
పరువంపు కత్తికిఁ బదును వెట్టి
సేనావ్రజమ్ము ఖడ్గాన వైరులఁ జంప
తనువున వీరగంధమునుఁ బూసి
బుడుతపాపల చిన్నారినుడువులందు
కీర్తిపౌరుషరేఖ గ్రక్కించి విశ్వ
రంగమున పేరు గాంచి సెలంగు మేలి
సిరుల కిరవైన బొబ్బిలిపురము నాది.

౨

రంగారావు ధరాతలేశ్వరుని శౌర్యం బైన రక్తంపు బొ
ట్టుం గంచున్ మది తల్లడిల్లుచును నిట్టూర్పున్ నిగిడ్చెన్ లస
చ్ఛృంగారం బగుకోట ముట్టడికి బుస్సీ ఫ్రెంచిసేనాని మా
యంగంబుల్ పులకించు నేఁటికిని నాయూరాటముల్ విన్నచో.

3

వినిపించ దేల? ఖంగున నగారామ్రోఁత
కొమరార నీప్రాంతకోటలోన
పెకలలే దేల? మచ్చుకు గడ్డివరకైన
తాండ్రపాపయ ధర్మధామమందు
జలమాడ దేల? భీషణరక్తధారాస్ర
వంతిలోపల శౌర్యపద్మనిలయ

వెలయింప దేల ? కత్తులసాముసేఁతను
వల్లమాలిన నాఁటి చిల్లపెంకు
తెలియ దేల ? మా వెల్మవీరుల బలంబు
కానఁబడ దేల ? ఘనపరాక్రమ విభూతి
నాఁటి మా వీరబొబ్బిలి మేటిచరిత
క్రగ్గిపోయెనె ? భూమికంపముల కకట !

౪

రణమున రంగరాడ్విభుఁడు రక్తఝరీభరితప్రగాఢసా
ధ సగరమున్ గమించి తన దాదులగర్వముఁ జీల్చి వాఁడి క
త్తిని గరముం ధరించిన ప్రదీప్తకథా వివిధార్థబోధ నేఁ
డును మన పల్లెపాటలఁ గడు న్మిళితం బయి మేను పొంగెడిన్.

౫

నాఁటి మా వెల్మవీరుల మేటి శౌర్య
సాహసోజ్జ్వల కిరణజాజ్వల్యమాన
విలయకీలలు చల్లారి వెలిసిపోయె
నిండుహృదయాల బాపూజి నిలుచుకతన.

౬

ఊడికినసెత్తుబొట్టుల మహోదధిలో జలకంబు లాడి వ
చ్చెదు మొసగాఁడు పాపయువిశీర్ణహృదిజ దమి నెట్టియూహతే
పాతమెనొ ? శౌర్యబీజములు మోసులువాడెనొ ? రాజభక్తి వం
గదము తెనుంగుఁనోపునఁ జెకాపిక నాటెనొ ? శాశ్వతంబుకై.

౭

ఏ నరదారు మస్తకమొ ? యే నరదారుని పాదయుగ్మమో ?
యే నరదారుప్రేళులొ ? మరే నరదారుని కాలిగోరులో ?
యే నతి దివ్యహస్తమొ ? యిసీ ! యిపు డీ రణభూమిలోఁ దృణం
బై సెలరేగెనో మునుల కందునె ? యిట్టి జగారహస్యముల్.

౮

కలహకేళినిఁ గూలియున్న పృతనాకంకాళముం గాంచి పొం
గులువాఱఁ ధనువెల్ల వీరరసముఁ గ్రోధోద్ధతిఁ వాడి ర
వ్వల బాకుఁ ఝళిపించి శాత్రవుల గర్భంబందుఁ బన్నుండు బె
బ్బులి మాపాపయ సంచరించిన పొలమ్ముల్ గాఢశంసార్హముల్.

---

## ప్రభూ!

౧

మిణుకు మిణు కని మెఱసెడు కునుకుదీప
మే మదీయకుటీరాన మేళవించి
నన్ను నోదార్చుచున్న దన్నా! పరేశ!
జాలి గల దొఱ! దీనుల నేలు వేల్ప!

౨

వినుగుఁ బుట్టించునట్టి నా పేదబ్రతుకు
నిముసనిముసమ్ముఁ దలఁప గుండియ ద్రవించు
స్వార్థజను లుద్భవించిన వసుధ దారి
యీ యభాగ్యున కేది? స్వామి! వచింప.

3

ఈ విశీర్ణగేహాన నా యీ పిశాచ
దేవి తీండ్రించు కొంపను దీర్ఘకాల
బహుళకంటక జీవనవనములోన
మనుటకును నాకు గడియయు మనసు రాదు.

౪

మిగుల భయపెట్టు నన్ను మబ్బుగమి కూడ
వానకై గూఁడు కట్టుకోలేని నన్నుఁ

గాంచి నా జీవితమ్మునుఁ గాంచి నీకు
కరఁగదా! గుండెకాయ నిర్ఘరమునట్లు.

౫

నిన్ను శరణుఁ గోరి నీవంక నిలుచుండి
నీదు పాదసేవ నెమ్మి మీఱఁ
జేసి మ్రొక్కు నాదు దోసమా యిది యేమి?
మందలించి నన్ను మనుపు మయ్య!

౬

దివ్యకవిత వ్రాయఁ దెగియింతు నంటినా?
యోగి విచారములకుఁ దగులుకొంటి
సృష్టిఁ జేసి నన్ను సిలుగులలో ముంపఁ
గంకణంబు నీవుఁ గట్టినావె?

౭

రసమయం బైన యీ దొడ్డప్రకృతిలోన
వేడినిట్టూర్పు విడిచి నేఁ బాడుకొందు
హృదయమునుఁ బెకళించి యభ్యుదయగీతి
పరమ పరదైవులో నన్ను మఱచిపోకు.

౮

రెండుజేనెల నేలైన లేదు నాకు
బికిర మెత్తుచు నేను జీవించుకొఱకు
పాత్ర కొక జేన! నా కుక్కిపడక కేది
జేన; దీనజనావనా? యానతిమ్ము.

౯

నాకు నీకుఁ గల్గు నయమిత్రబాంధవ్య
మెప్పుడు కల్గెఁ గాని యింతదాఁక

ననఘ ? నా కుటీరమునకు రా వదియేమి ?
మొగము ద్రిప్పుకొనుట తగునె ? తండ్రి !

౧౦

సొమ్ము లేనికతనఁ జుట్టాలు మిత్రులు
తల్లి దండ్రు లింత దరికి రారు
నీవుకూడ సొమ్మునే చూచి వత్తువా ?
అయిన నాదుజన్మ మసలు సున్న !

౧౧

సరసతను మాటలాడి టక్కరితనానఁ
బరుల వంచించి వెలుపల నురుల నొడ్డి
మిడిసిపడునట్టి జనులసమీపమందు
కాఁపురము సేయ నా కొంపఁ గట్టలేను.

౧౨

ప్రకృతిలో సమస్తవైభవాల నిమిడ్చి
నాదుభాగ మింత నాకు నీక
లేమిలోన నేల ? కామమ్ము పుట్టించి
చావుదెబ్బ గొట్టినావు తండ్రి !

---

## శ్రీకృష్ణదేవరాయలు

౧

పృథుల మకరందము వెలార్చు కృతిసుమాళి
వనములోపల హర్షాన మునుకవేసి
దేవురించెడు కవులకుఁ దెరువుసూపు
కృష్ణరాయాగ్రణీ ! సమస్కృతులఁ గొనుమ !

౨

విజయంబుం గొని దివ్య విక్రమకళా వీరాధివీరుండవై
ధ్వజమున్నిల్పితి బొట్టునూరను ప్రభావంబెన్న దర్బారు ది
గ్గజముల్ జేయన వందిమాగధులు నీగంభీర శక్త్యున్నతిన్
భజియింపన్ భళిరా! నమస్సులివె భూపా! కృష్ణరాయాగ్రణీ!

౩

తెనుగుంగబ్బపు ముద్దుముచ్చటలు సందీపింపఁగా వ్రాయు పె
ద్దనగారిన్ బహుగానుతించి భవదుద్దామంపు పేరోలగం
బున నాస్థాన కవీంద్రుఁజేసి కనకంపుం బుగ్గలందేల్చి ఫ
ల్గునుగా జేసితి కొమ్ము టేన్గుపయిఁ దెల్గుల్ మెచ్చ రాజోత్తమా!

౪

పటువైశద్య విశాల భావకవితావ్యాసక్తు లున్నారలు
త్కట పాండిత్య వియత్తలాపగ మహా గంభీరవీచీ సము
త్కటడోలాళుల నూగువారలును నీ దర్బారునందుండి రే
మిటికో? పెద్దనగారి కట్టిగగ్గెరను మేల్మిన్ వేసితో భూపతీ!

౫

పసిడిగగ్గెర చిఱుగజ్జెల సమితి కెటు
లల్లనల్లన ఝల్లను చనుచు నాడు
నిండు కొలువున వ్యాపించె దండి శబ్ద
మిపుడు మా చెవుల్ గింగురు లెత్తుచుండు

౬

మొలకలెత్తినది ప్రఫుల్ల వానన లీన
వేవేలఁ దెల్గు భాషావనమ్ము
నిండిపోయినది మానికపు రాసులతోడఁ
దోరాన హంపి బజారులన్ని

ముపమందినది అందము మహావిలాస క్రి
యారీతి పెద్దన యమరకవిత
రహియించినది హంపి గృహగృహంబుల నాంధ్ర
కమనీయ సాహితీ కాంతిచయము
ఈవు చెక్కించి పోయిన యింపతంపు
విలసనంబైన శిల్పంపు కులుకుతనము
దిద్ది తీర్చిన హంపీ ప్రవేశమందు
నెలమిఁ గన్పట్టు నేఁటికి కృష్ణరాయ !

౭

ఎటఁ గాంచిన కవి పండిత
నటకులు గాయకులు శిల్పనయకోవిదు లు
ద్భట వర్గంబులు నీదు ప్ర
కటగుణములఁ జాటువారె ? క్ష్మానాధమణీ !

౮

కవనమల్లిన ప్రతివాని గడియ యేమొ
కాని నిత్య సన్మానంబు నాపెము లిడి
చేసినావంట వారికి క్షితితలేంద్ర !
తెనుఁగు శారద కవి మంచిదినము లేమొ ?

౯

మనుచరిత్ర కవితాఘన దివ్యగంగా ఝు
రీలహరిని మున్గి తేలినావు
పారిజాతగ్రంథ పరిమళోద్యానంపు
సీమలో విహరించి చెలఁగినావు
అముక్తమాల్యద యను దొడ్డ కబ్బంబుఁ
గల్పించి వ్రాసి పే ర్గాంచినావు
చినచిన్న కృతులను తెనుఁగుఁ దొయ్యాలిఁ బెండ్లిఁ
జేసికొని సుఖంబుఁ జెందినావు

కవుల వీపులు బరువెక్కఁగా నొనర్చి
కానుకల నిడి సంతృప్తిఁగా నొనర్చి
తెలుఁగు కవితకు నొక వన్నెఁ దెచ్చినావు
మేలు భళిభళీ! కృష్ణభూపాలచంద్ర!

౧౦

ఓ నరనాథ! యెంతటి మహోజ్జ్వల సత్కవిచంద్రుఁడైన, వ
ర్ణాన కలంగి కృంగునను న్యాయము నేఁడునుగాక నీదు సం
స్థానమునందుకూడ గలవా! యిఁక నీకళ కేది దారి లో
కాన కులమ్ము లేని కవిగండఁడు శారద కెట్లు నచ్చెనో?

౧౧

కొలువు కూటమున భాసిలి కళ వెలయింపఁ
బెద్దన్న గొంతును విప్పునపుడు
తీవిమై సింహపీఠికపయిఁ గూర్చుండ
హెగ్గడీల్ నిను సన్నుతించునపుడు
రమణంపు నీ దివాణమున నొకే తీరుఁ
గృతికన్యకల లాస్య మేలునపుడు
అరుల గుండెలఁ జీల్చి సరిరాకఁ గని జయ
భూరిదుందుభులు మార్మ్రోగునపుడు
కోఱమీసాల పొంకంబు గొప్పఁదనపు
దొడ్డ బింకంబు నో తెల్గుదొర తరంబె?
కనుచు వర్ణింప వనజగర్భునకునైన
మేటి కవిరాజుకైన భూమీతలాన

౧౨

కాలికి గండపెండరముఁ గట్టిన నీ సముఖాన నేను భూ
పాలక యున్న గగ్గెరను పాదముకుం దొడగంగ నాసరా
జాలదు కాని నాకు నెడఁ జక్కని కైత వసంతకాల వృ
క్షాల వసించు కోయిలల గానముఁ దీయగ నాన గల్గెడిన్.

# కవిపరమేశ్వరుఁడు

౧

మీసముఁ ద్రిప్పి యీ తెనుఁగుమేదిని దివ్యకళాప్రపూర్ణ వి
ద్యాసము దీర్ణపండితకదంబము గుండెలదంగ గెల్చి ధం
కా సరిఁగొట్ట నీవిజయకాహళరావము మ్రోతమ్రోగె నో
హెూ! సములేరి నీకు కవితోజ్వలవిగ్రహ! వేంకటేశ్వరా!

౨

నానాంధ్రావనిమండలేశ్వరుల సన్మానంబులంగొంచు వి
ద్యానైపుణ్య బుధోత్తముల్ గలుగు నాస్థానంబులో నీయ ప్ర
జ్ఞానైపుణ్య శతావధాన కవితాజ్ఞానప్రసూనమ్ములన్
జా నొప్పన్ విరజిమ్మినావు కవిపంచాస్యా! నమస్కారముల్

౩

నిను డీకోగయతించువా డొకఁడు లేనేలేడు నీయాంధ్రభూ
మిని నేడీయుగమందు నన్నయలు వాల్మీకుల్ సరేయున్న నీ
ఘనవైదుష్యకవిత్వపాండితికి కంగారొందరే? వారు లే
రని నా వాదము గాదు వేంకటకవీశా! సత్కవీంద్రప్రభూ!

౪

అలఘుప్రస్ఫుట కీర్తిడోలికల నాహా! తిర్పతి శ్రీకవీం
ద్రులతో నూగిననాళ్లు నెంతనెద సంతోషించితో నీవు నే
డిలపై తిర్పతి యెట్టి పుష్పముగనో యే స్వర్గమందుండి వె
ల్గుల సన్మానముఁ గాంచి మెచ్చుకొని నిన్నుంజూచి మోదించునో?

౫

కవులకుఁ గవిభూషవులకుఁ
గవిసమ్రాట్టులకుఁ గుకవిగజహర్యక్షా!

కవిపరమేశ్వర నీవె గు
రువగుదువు నిజమునుమీ నిరూపణ సేయన్.

౬

శబ్దశాసనుఁడు రాజనరేంద్రు నాస్థాన
గురువయ్యె రాజమందిరములోన
మనుమసిద్ధి విశేషమర్యాద లందెను
తిక్కన్న నెల్లూరి పట్టణమున
కృష్ణభూజాని మేలిమి పూజనల నందె
పెద్దన్న విజయహంపీపురాన
రఘునాథరాయ గౌరవకీర్తి నందె వేం
కటకవి తంజనగరమునందు
వారలొక రాజుచే నొక్క పత్తనమున
నయ నగౌరవమునుఁ గాంచినావు నీవె
యావదాంధ్రావనీ పూజఁ జెంది నేఁడు
పాదమిడినాడవీ బెజవాడలోన.

---

# కర్ణుఁడు

౧

గంటను కోటగుమ్మమునఁ గట్టి సుయోధనుకంటె మేలిమ
న్నింటనటంచుఁ బేదల ధ్వనిన్విని ప్రేమరసానఁ బొంగు నీ
వంటి మహానుభావునకు భారత యుద్ధమునందుఁ గెల్పు రా
కుంటమి కర్ణ! నాహృదయ మూరక నీరయి పారితీఱెడిన్"

౨

అవురా! నీ యసమాన దానబల విద్యాసంపదలఁగాంచి ని
న్నవరోధింపగ మాఱువేసమున నాకాధీశుఁడే వచ్చి నీ

ము విశేషంబగు కర్ణవేష్టణములన్ దోరాన నిమ్మన్ననో
రవిజా! తక్షణమీయ నీ విపులధర్మంబున్ బ్రదర్శించెడిన్.

౩

నీ గుఱి కౌరవేశ్వరులనే గెలిపించుట నాజి; శౌరి ప
న్నాగము పాండవేయులె రణంబున్ గెల్వనె దెట్టులైన శ
స్త్రాగమవేది! నీ బహు మహాబలవిత్తము కయ్యమందు వే
ఱేగతి శాపముల్ కతననింతకుఁ గ్రగ్గెను భానునందనా!

౪

అనుకంపమ్మొక యింతలేక కుటిల వ్యాపార పారీణులై
యనిలో నీ యరదంబుఁ గ్రుంగ నిను సన్యాయంబుగాఁ జంపె వె
న్నుని మోసాల నెఱుంగలేక విజయుండున్ భండనక్షోణిలో
నినజా! లేనియెడన్ జయంబచట నీదే సుమ్ము ముమ్మాటికిన్

౫

ప్రజలిఁక నెత్తిరుద్దు నపవాదుకు లొంగి సభాముఖాననం
బుజహతపుత్త్ర! నీ జనని ముద్దులగారెడు నిన్నుఁజూచి పి
ల్వ్యజనదు లేనిచో గురువులా; నిను నాతఱి గేలిసేయుటల్
విజయుఁడ నిన్ను గెల్చుట భళీ! యివి కర్మనిబద్ధ జాతకాల్.

౬

జవముందిటిన యస్త్రశస్త్రములు నాశాలక్ష్మి మోహింప నా
డవురా! గుప్పితివీవు నాప్రజల జన్యక్షోణి భీతిల్ల కే
శవపార్థుల్; నడినెత్తిపై వెలయు నాశాపమ్ములే లేనిచో
రవిజా! నిన్ను ద్రిమూర్తులే గెలువజాలన్నేర్తురా యుద్ధమున్

౭

ఆహవ భూమిలోపల మహాత్ములు పేంద్రుల యంతవారె యు
త్సాహముతో శరమ్ములను దాలిచి పాండవపక్షపాతులై

దోహదమీయఁగర్ణ ! రణధూర్తుల గర్వముఁ జెంపనిల్చినా
వోహొ ! సెబాసు నీదగు సముజ్జ్వల పౌరుషరాశికి న్నుతుల్ ”

౮

నినుఁ బట్టపురాజుగఁ జే
సిన దుర్యోధనుని యాన చెల్లకపూర్వ
మ్మున మరణ మయితి విదె నీ
యనవద్య ప్రకట చరిత కంజలి కర్ణా !

---

# భీష్ముఁడు

౧

పదియునెనిమిది రోజుల భండనమున
ధర్మజుఁడు శౌరివిజయులే తల్లడిల్ల
వెకిలి జీవుండు నగు నపుంసకుని ముందు
వృద్ధవీరుండ శరము సంధించ వేల ?

౨

మోసముచేత నింగెలిచి పోయిన పాండవసూను లెల్లరే
వీసపు భాగమైన పృథివీ వలయంబుఁ గ్రహించినారె ? భీ
ష్మా ! సమరాన నింగెలువజాలు మగండిల పుట్టునే ? శరా
భ్యాసము రిత్తవోవునె ? జొహారుభవద్ఘన దివ్యశాంతికిన్.

3

గురుఁ డా భార్గవరాముఁడే యనిని నీకుం జంకి యుల్లాడె నీ
శర సంధానవధాన నైపుణ కళాసామర్థ్యముం గాంచి యు
బ్బురమందెన్ జగనొబ్బ గండ సమరంబున్ నీదె పైచేయి యె
వ్వరు కాదందురు తథ్య మీ విషయముల్ వ్రాతల్ నదీనందనా!

౪

వ్రేతలగేహాన వెన్నముద్దలు మెక్కు

నల్లనివాని పన్నాగ నత్తి

గురువుగారి యమోఘ తరమైన సాధన

వరమైన గొడ్డలి పచ్చిబలము

వాడవాడలయందు బలము సాధించి కు

స్తీల నెగ్గిన భీముఁ జేతికఱ్ఱ

అల ధనంజయుని చేతుల సొమ్ము బలగమ్ము

కదనానఁ బొగరెక్కు గాండివమ్ము

నిన్ను నెదిరించునేఁ బోరనిలిచి దుశ్శ

కున మగు శిఖండి సమరానఁ గనుటఁ గాని

ఘన కురుక్షేత్ర యుద్ధరంగాన నీవె

యదనుఁ జూచియు శరము డించుదువ భీష్మ!

౫

సమరంబున్ బ్రతివాది కక్షులకు నాశాజ్యోతి చల్లార గు

ఱ్ఱములన్ దేరుల నేనుగువాహినుల నేలంగూల్పగా నాఁడు నీ

యమలంబైన పవిత్ర వర్తనకు సాక్ష్యంబిద్ది వ్రాక్రువ్వ నో

సమదగ్ర ప్రతిభావిశేష! గురుభీష్మా! దివ్యగంగాసుతా!

---

# కిరీటివిషాదము

౧

నాకీ యాలము వద్దు సోదరులతోనా? నేను పోట్లాట, కృ

ష్ణా కారుణ్యపయోనిధీ! వలదు రాజ్యంబేలు వ్యామోహముల్

నా కళ్యాణముఁ గోరు పెద్దలు గురుల్ నా బంధువర్గంబులన్

ఢీకొన్నన్ ఫలమేమి జాఱెడిని గాండీవమ్ము నా హస్తమున్.

౨

కన్నాకున్ననుఁ జేయగాఁ దలచి శ్రీకారుణ్యపుంగుండె ను
త్పన్నంబైన రసార్ద్రమంజుల సుధాభావాననం దేల్చి నేఁ
డిన్నాళ్ దాక నఖండదృక్కులను నెంతేఁ జూచు నాయొజ్జ ద్రో
ణున్నే నెట్టు వధింతు భండనమునందున్ నేఁడు దామోదరా!

౩

ఖగతిన్ మల్లడిఁజేయుగాఁ గల తపశ్శక్తిస్వరూపుండు నా
పగసూనుండు మహాపరాక్రమ యశోభాస్వంతుఁడౌ భీష్ముఁడౌ
నుగవా! యాతఁడు తాత వెండియును కర్ణుండన్న సామాన్యమా?
తగవా? యుద్ధము నాకదేల? యనుగుం దమ్ముండ్రతో మాధవా?

౪

రణభూమిన్ బ్రతిపక్షనాయకుల బుజ్జల్ జీల్చి చెండాడి చి
క్కిన సామ్రాజ్య వధూమణింగరమునం గీలించి భోగాలఁ దే
లిసకంటెన్ పులిభిస్సటన్ మెసవి సంతృప్తిన్ బ్రహర్షించి జీ
వనమున్ సేయుట మేలు వైరమిఁక బావా! వద్దు ముమ్మాటికిన్.

౫

బలముంజూచి తెగించి భండనము దేవా! సేయుచో నాదు బం
ధులసంఖ్యాకమనంతముల్ జయముఁగొందున్ జాలుఁజాలింక నెం
దులకీ యాసలులేని స్వర్గగృహసందోహంబు సృష్టించుటల్
కలధౌతాంబరధారి! నా చిలిపివ్యాఖ్యానమ్ము మన్నించవే?

౬

కణకున్ ముష్కరబుద్ధిచేత నల లక్షాగేహమున్ మమ్ము సో
దరులా కౌరవులెల్లఁ గాల్చనట యత్నంబున్బొనర్పంగ నీ
కరుణాసాంద్రవిలోకన ప్రభలతోఁ గాపాడినావన్న నీ
ధరణిన్ దేవర! నీదు వాక్కులు శిరోధార్యంబు మాకెప్పుడున్.

౭

వలదోయీ? చిన మెత్తుమా బ్రతుకుకై బ్రహ్మాండమా? లేవె కొం
పలు జీవింప నితాంతహర్షమున నోస్వామీ! యథార్థంబుగాఁ
దెలుపన్నెత్తుటి కూటిభోజనపు విద్దెల్ నాకు వద్దింక చే
తులు రాకున్నవి నన్ క్షమించు గుణసింధూ! దీనబంధూ! నమో

౮

అయినన్ సంగరభూమిఁ గాల్నిలిపి శస్త్రాస్త్రమ్ములం గుప్పి యీ
జయ మార్జింపఁ దలంపు నాకసలు ప్రస్తావింపగా లేదు, నీ
దయయున్నన్ బదివేలు నాకది మహాత్మా! యిట్టి కంగారు నా
కయయో! రుద్దకు దుగ్ధసాగర విహారా! భక్తకల్పద్రుమా!

౯

పగవారా! యలకౌరవేశ్వరులతో పాటల్ల భీష్ముండు నా
దు గురుగ్రామణి! ద్రోణుఁడున్ సకలబంధువ్రాతముల్ కృష్ణ! నా
దగుదౌ శ్వైర్యము నీరసించెడిని మిథ్యాప్రాజ్యసామ్రాజ్య మే
లఁగ నాడెందము పొంగిపోవదు విలోలంబయ్యె వాక్కువ్వఁగన్.

---

# కృ పా భి క్ష

౧

నన్నుంగంటివి నన్ను మంచితివమందానందమునుం బొంద నేఁ
డిన్నాళ్ దాక నఖండభూవలయమందీ వెంతొ దీవింప నీ
కన్నుల్ముందర నాట్యమాడగను నీకా! డెంద మందిప్పు డు
త్పన్నంబయ్యె విరుద్ధభావములు మాతా; దృష్టి సైరించుకో.

౨

మరపుందట్టుచు నన్నుఁగూడఁ దనియింపన్ నీదు గర్భాన ని
ర్భరమోదాన ననుంగునందనునిగా బంగారుపూబంటిగా

సరవిన్ గంటివి నాయనుంగుజననీ! సౌమ్యంబు సిద్ధించెనే ?
మరుగై పోయెనె ? యీకులాల గొడవమ్మా ! న్యాయమిప్పించుమీ.

౩

అవనీ చక్రము సంతసంపడగ విద్యామూర్తి రాటాలరా
జు వివేకంబున శాంత్యహింసలను విచ్చుంగత్తులంబట్టి నా
డవ రోధించె బ్రిటీషుపాలకుల రాజ్యార్థంబు నీసూనులీ
యవకాశంబును నిల్పఁజాలగల సాహాయ్యంబు నిప్పించుమీ.

౪

ఢిల్లీ రోదసివీధిపై నెగసి యాడెంబో దిశా గోళపున్
గల్లోలంబును మాన్పఁజల్లదనపుం గళ్యాణ రేఖారుచుల్
జల్లెన్ నీ పసుపుంజతాకము ప్రశస్తంబైన నీకీర్తి నం
ధిల్లెన్ మాకు దరిద్రమూర్తులకు తల్లీ! సౌఖ్యమిప్పించుమీ!

౫

బ్రతుకుల్ దుర్భరమైన యీజగతిలో వైషమ్య భావంబులే
మెతుకుల్ రూపము మారిపోయెను గదే! మేలెంచువా డేడి మా
గతి నీక్షించఁగలట్టివా డొకఁడు వక్కాణింపఁ గన్పట్టునే ?
రతనాల్ వజ్రములున్న దానవు కృతార్థత్వంబుఁ బొందించుమీ.

౬

మిసిమివెలార్చు నా పసిడిమేడల నీడలలోన నాకటన్
విసిగివిసింగి దేహముల వీడిన పేదల మస్తకంబులన్
మసలు కళాధిదేవి యమమార్గముఁబట్టి నశించిపోవ నిం
పెసగునె ? దేశభాగ్యములు విద్దెకు తావల మింత లేనిచో.

౭

బ్రతుకుఁ జాలించినట్టి యే ప్రభునకొ ? తొలి
జ్ఞప్తికై శిలావిగ్రహాల్ గట్టె; నాఁడు

కొలిచి నారలు నేఁడింత తలచినంత
వెలయు నిముసాన మా శిలావిగ్రహములు.

౮

సందేహింపకు మాత్మలోన్ ఘన సత్సాంగత్యమే లేని యీ
వందల్ వేలుకులాలమధ్యమున కొంపంగట్టి నే నుండనో
హిందూమాత భరింపలేని పనిసుమ్మీ ! శాసనాల్‌వల్ల నీ
నిందారూపకమైన భేదములు సంఘింపంగ వీలైనదే

౯

బూజుపట్టిన వంత మూఢసిద్ధాంతాల
    ముదలకించెను రామమోహనుండు
జన్మ సత్త్వమె ప్రజాస్వాతంత్ర్య మనుచు ఢం
    కాఁ గొట్టె బాలగంగాధరుండు
సత్యమే శాశ్వత జయపతాక నిరంత
    ర క్షేమమనె స్వామి రామతీర్థ
భారతజాతి సంవైదగ్ధ్యమును నిల్ప
    విధి మనదనెను గోవింద రనెడి
  పుత్త్రుల యెడందలోఁ బొంగిపోవునట్టు
  భరత పౌరుషవ్యోమ శుంభ్ఝురాంబు
  రాశి ప్రవహించె భువనాలు ప్రణుతిసేయ
  నిపుడుఁగూడ నటులె ప్రవహింపనిమ్ము.

౧౦

పౌరుషమూర్తులై భయద భండనభూమిని చండభానులై
వైరిశిరాలఁ ద్రెంచిన యపార రణోత్సుక శాలులమ్మ నీ
కూరిమినందనుల్ కుడువఁ గూడును లేక యెదిర్చి రమ్మ దో
స్సారముఁ జూపి నాఁటి బల సంపదలిమ్మనుగుం గుమాళ్ళకున్.

౧౧

అల కంచి కామమ్మ జ్వలిత నేత్రాగ్నిలో
కఱఁగిపోయిన వీర భరతజాతి
గజనిమామూదు నిష్కరుణంపు దోసిల్ల
క్రుంగిపోయిన వజ్రమణుల రాశి
బ్రిటిషు రాజన్యుల పెత్తనమ్ములక్రిందఁ
గతిఁ దొఱంగిన మంచి బ్రతుకుఁదెరవు
నట్టింటిలోన నన్నాదమ్ముల విరుద్ధ
ప్రకృతిలో జాఱిన బాంధవమ్ము
తావకీన సౌభాగ్యాల చేవఁ దరుగ
మొదట నివి మూలకారణ భూతమయ్యె
వాసిగన్నట్టి నాజాతి వరచరిత్ర
పసిడి వ్రాతలమూలాన ప్రబలుటెపుడొ ?

---

# నెహ్రూ

౧

ఎన్ని యగ్గికొండ లెన్ని మహావార్ధు
లెన్ని నెత్తురుబొట్టు లింకిపోయె
నీదు గర్భకుహరి నెహ్రూ ! జగద్బంధు !
తల్లిదేశ దీర్ఘదాస్యమునకు

౨

నరవిన్ నాల్గగు ఖండవాసులకు భాస్వంతుండవై దివ్య సో
దరభావంబు విడంబమొప్ప దశదిగంతుల్ జయధ్వానముల్
నరసానందము మీరనల్పను జయస్తంభంబు నాటన్ బ్రజా
పరిషత్తున్ నెలకొల్పు నీమహిత ధీప్రజ్ఞాబలం బెంచెదన్.

3

భువనంబుల్ గబళింపఁ జాలగల దివ్యుల్ ; దివ్యతేజస్సము
ద్భవచారిత్రులు హూణరాట్ప్రముఖ సంతానంబుగా రాద, శాం
తివిభాఖడ్గధరుండు మౌని యగు గాంధీతాతతోఁ బాటు మా
ధవులే మెచ్చ శ్రమించితో యిచటి స్వాతంత్ర్యమ్ముకై నెహ్రుజీ!

౪

కులముల్ పెక్కుగలట్టి దేశమునకున్ క్షోణిఙ్ స్వతంత్రంబు రా
గలదంచున్ మతినెంచి నీ సకల విజ్ఞానమ్ము వెచ్చించి సా
మ్ములరాసుల్ భవదీయ మాతృకపదంబుం జేర్చి మోదాస జై
లుల క్షోభిల్లిన నీకు సాటెవఁడు నెహ్రూ! మంత్రివాస్తోష్పతీ!

౫

చిలుముంబట్టిన భారతావని జయశ్రీవైభవంబెల్ల శో
భిల శాసించిన నీదు శాసనము లుర్వీ ముగ్ధముల్ ధన్యముల్
భళిరే! నీయటువంటి ప్రజ్ఞగల భాస్వన్మూర్తినింగాంచి మా
తలి యుప్పొంగఁ బ్రహర్షకార్యమదిగాదా! మాకు విద్యానిధీ!

౬

పొగరుఁబోతునిజాము భూరిసామ్రాజ్యంబు
గెలిచి జెండా యట నిలుపునాఁడు
స్వాతంత్ర్యఖండనక్ష్మ నిల్చి గెల్చి సా
మ్రాట్టులే పొగడ జైకొట్టునాఁడు
తల్లి భారతమాత యుల్లంబు ముదమంద
బానిసత్వము దూరపరచునాఁడు
అఖిలాసియా సమైక్యముఁ గోరి కడుఁ బ్రజా
పరిషత్తు నెలకొల్పి వరలునాఁడు
మూడుపదులమీద మూడు కోటుల తమ్ము
లలతి స్వేచ్ఛరథము నధివసించి

యాత్మఁ బొఁగునప్పు డాదర్శమూర్తి! నీ
ప్రజ్ఞ కిడరె వేయి వందనములు.

అమరజ్యోతి శుభాశిషమ్ములను దివ్యానంద సందేశ రా
జములన్ మున్పటిరీతిఁ గొందువొకొ? యానల్లేవొకో? తెల్ప నె
హ్రూ! మహాత్మా కులభిన్నదేశమున నీ రోజుల్విచారింప ధ
ర్మము దూరంబయి కర్మవెంటబడి స్వార్థాపేక్ష హెచ్చయ్యెడిన్"

అనుగుందమ్ముల రుంధతీసుతులకన్నా నేఁటి స్వాతంత్ర్య సౌ
ధ నివాసంబనలే హుళక్కి యనుచాత్మన్నేఁడు దుఃఖంబు తో
డను నిట్టూర్పు నిగిడ్చునారిపు డఖండంబైన ప్రేమాన వా
రినిఁ ప్రేమించి నివాసయోగ్యతలుఁ గల్పింపంగ నర్థించెడిన్.

---

# తెలుగుతల్లి

౧

తొలినాఁటి తెలుగుఁ బూవులఁదోపులోన, న
న్నయ్య తేనెనుఁ ద్రావి యలరునాఁడు
మెఱపులచ్చమ్మ బమ్మెరవారి గుమ్మాన
కంజజు సతిఁ బట్టి గుంజునాఁడు
ఆర్ద్రహృదయుఁడు బ్రహ్మన్న కంఠమునెత్తి
కులము లేదని నొక్కి పలుకునాఁడు
తగు చిత్తశుద్ధి మాధవవర్మ రారాజు
సభలోన న్యాయంబు జరుపునాఁడు
తెనుగు లెల్ల రనుఁగు ననుజుల చాడ్పున
మెలగునాఁడు కీర్తిఁ జెలగినాఁడు
ఘనతఁగాంచినావు గద! కీర్తి నీనాఁడు
నిలుపుకొనుము మరల తెలుగుతల్లి.

౨

స్థిరసత్కీర్తిం ఘటించి సంపదలనెంతే దూగి లోకాలలోన్
బరువుం బేరునుఁగొంచు ధర్మమును జ్ఞానంబుం బ్రచారంబు సం
బరమున్ సల్పి మహాహవస్థలుల శుంభద్ధైర్యముం జూపి ని
ల్చిరి నానందనులంచుఁ బొంగితివి తల్లీ! నేడు వీక్షింపుమి!

3

చెల్లెంబూర్వపు పోకడల్ విపుల సచ్ఛ్రీ భోగభాగ్యాలు రం
జిల్లన్ తావులు లేవు నీసుకవితో న్మేషంబు పెంపొంద నా
సల్లే వింతకు సత్కవీంద్రతతి కాశాజ్యోతి చల్లారె, నా
తల్లీ! యెట్టులఁ దమ్ముఁ గుఱ్ఱలకు సంధానంబుఁ గల్పింతువో ?

౪

పలుకం దొల్లిటఁ బొర్గువాసులకు సావాసంబుఁ జూపించి వా
రల దుఃఖంబునుఁ బంచుకొంచు సరియర్థంబొప్పు భాగాన క్ష్మా
తలి సౌమ్మిచ్చి చరించుదానవు ; మహాంధ్రస్వర్ణకళ్యాణి! జో
తల నర్పించెద దిద్దుకొమ్మనుగుఁ బుత్త్రశ్రేణి వైరుధ్యమున్ ॥

౫

మూడుంగోటుల నందనుల్ కలుగు నీ పుణ్యంబపూర్వంబుగా
నీ డేరాలల గాలిలో నెగురు బాణిన్ బొందులుం బొత్తులున్
నేఁ డావంతయు లేక క్రోధ విషవహ్ని గ్రక్కుచున్నార లా
యా, డాబుల్ సవరించి పుత్రులకు తల్లీ! పొందు నేర్పించుమీ ?

---

# కృతజ్ఞత

౧

అలికాక్షుఁ గుస్తీల యనిలోన నెదిరించి
పార్థుండు గెలిచిన ప్రధనభూమి
బలికి, బలిగ తనూభవుని నర్పించిన
మాధవనృపమౌళి మహితసీమ
స్వైరవిహారమ్ము పంచాననముమీద
కనక దుర్గమ తిరిగిన తలమ్ము
అపరవిద్యామూర్తి యౌ చెళ్ళపిళ్ళ వేంక
టేశుండు తన పాద మిడిన తావు
పేరు మ్రోపిన తెల్గుల వీరకవుల
కెడమ పాదాల గగ్గెరల్ దొడుగునట్టి
ఆంధ్రరాజ్యేందిరకు ముద్దుటనుగుపట్టి
విపులకళలకు నిలయమ్ము విజయవాడ.

౨

మధురపిక కూజితములకు మనమునందుఁ
బొంగిపోయెడు దిగ్దంతులుం గలట్టి
యీ సరస్వతీపూజా ప్రభాసమాన
మందిరమ్మున నా పాట యందమెకద!

3

ఎలమిన్ శ్రీ బెజవాడ పత్తనము నీ కృష్ణానదీ సైకత
స్థలులం గ్రుమ్మరి మంజులార్భటుల వైదగ్ధ్యంబుఁ గ్రుమ్మించు, కో
యిల, యస్మత్ కవితాకుమారి యిది యెంతే నిక్కువంబైన నా
కలముం దిద్దిన బాపుజీ మధురకాంక్షల్ దీరెనంచెంచెదన్.

౪

పంచమశబ్దంపు బ్రళ యాగ్నికీలలో
దగ్ధమైపోయె నా ధన్యతనువు
యుగయుగంబులనుండి పగవాని హస్తాన
నలిగి జీర్ణించె నా కలిమి బలిమి
కొఱగాని శాసనోత్కర బంధనపు చాయ
చాటున మఱగె నా చదువు సంధ్య
ఆలంబ మిసుమంతయైన లేనికతాన
యుడిగి చల్లారె నా యూహాశక్తి
చితికిపోయిన బానిస జీవనమున
చెదరి యింకిపోయినం నా చీమునెత్తు
స్వాంతమున భేద మెఱుగనివాఁడె నన్ను
నింపు మీఱఁగ ధర నుద్ధరింపఁగలఁడు.

౫

చవులూరించెడు సత్కవిత్వ రచనా సామర్థ్య వైశద్యమున్
జవిఁ జూపించిన దిగ్గజాలుఁ గల యీ సాహిత్య పీఠాన మా
కవిసమ్రాట్ చరణంబు నిల్పిన సభాగారాన వీర్యాన, నా
కవితాకన్య పొనర్చు నృత్య కటకక్వాణమ్ము రాణించెడిన్ ”

౬

ఏనాడో యల కృష్ణభూమిపతి సాహిత్యస్ఫురద్డోల వి
న్నాణంబుం గళ మెత్తిపాడె కవితానాధుండు పెద్దన్న ది
వ్యానందాబ్ధి తరంగ డోలికలలో నాటాడనేఁడీ కవీ
శాన గ్రామణులాడఁ దావుఁగలదే? సాహిత్య రత్నాబ్ధిలో ”

౭

భాషాగభీర శుంభ ద్రత్న నిలయాన
భావ రత్నములేర్చు పండితుండు

పేరొందినట్టి కవిబ్రహ్మలకు వాక్కు
నేర్పించు సుకవితా నిపుణబుద్ధి
సంస్కృతాంధ్రాంగ్ల భాషాదేవతలఁ గొప్పఁ
బూలను ముడిచిన మోహనుండు
తెలుఁగుయోద్ధల మహోజ్వల శౌర్యకార్యాల
నెత్తి తావ్రాసిన యిద్ధసుకవి
ప్రథిత విశ్వనాథ వంశ సాగరసుధా
కరుఁడు సుజనవరుఁడు, శ్రమ యశుఁడు
సభ నలంకరించె సత్యనారాయణ
యెదురులేని కయితఁ జదువుకొందు.

౮

వాడి బాకును జడిపించి పగరగుండెఁ
జీల్చి చెండాడి పులియని చెప్పుకొన్న
పాపరాయండు పుట్టిన ప్రథితసీమ
బొబ్బిలి పురమ్ము నాజన్మ పుణ్యభూమి.

౯

చివికిపోవు నిరాలంబ జీవనమును,
గడుపుచున్నట్టి నా కావ్యకన్యఁ గాంచి
శరణమిడిన మాయయ్య దేవరపు దొరను
సత్కృతికతాన జగతినిఁ జాటుకొందు.

౧౦

ఏనాఁడు నాజాతి జ్ఞానప్రసూనాలు
కాయలై ఫలసిద్ధి గాంచఁగలదొ ?
ఏనాఁడు నాజాతి పృథులభోగము ధరా
భాగాన లభియించి వరలగలదొ ?
ఏనాఁడు నాజాతి మానుషత్వ మొకింత
యున్నతస్థానమ్ము నూనిమనునొ ?

ఏ నాఁడు నా జాతి నాణెంపు రాణింపు
వెలుగొందఁ దళతళ త్తళలమనునొ ?
కాలరథచక్ర భీషణ గమనమందు
మంచిరోజుల నేనాఁడు వించుమనునొ ?
పలుకరించిన నడిసన్న తెలుఁగుకవిత
నాఁడుఁ దోరాన నాదు ఘంటము లిఖించు.

౧౧

ఓ జయవాడపట్టణ మహోజ్జ్వల సద్గుణశాలులార ! యు
త్తేజపరాక్రమోన్నత సుధీకలశాంబుధి చంద్రులార ! అ
వ్యాజకృపావిలోకన సుధామయ దివ్యకళాప్రపూర్ణులా
రా ! జయమౌత మీకిదె మదంజలి మంజులతా ప్రసూనముల్.

---

# కలువరింత

౧

కలికీ ! యెవ్వడు నెత్తిఁ గట్టి యిహలోక ప్రాజ్య భోగాన మే
డలు కట్టించు సురాల యాన, నట మేడల్ మిద్దెలుం గొంపలున్
గలవే ? లేవు ; నిజంబు ప్రాణులటయే గాలిందుమారంబులో
నలుసై యేమయిపోదురో తెలియదాహా ! దైవమర్మక్రియల్ ॥

౨

కాల మతిక్రమించెడి నిగారపుదేహము కాలవాహినిన్
దేలకమున్నె యీ యెడఁద దివ్వెలు నారకమున్నె యీ సుఖ
శ్రీ లవి బోకమున్నె కడురేచిన ప్రేమసుధాఝురీతరం
గాలనుఁ దేలిపోవుదమె కమ్మని హాయి కవుంగిలింతలన్ ॥

౩

వలపులరాణి నిక్కముగ బంగరుబొమ్మలవంటి కన్యకల్
గల సిరి కాలగర్భమున కన్నులుమూసినతోడనే శవం
బులు మన దేహముల్ మఱికిబొమ్మలు కాలము పోకముందె నీ
చలువతనంపు చన్నుగవసందున నన్నిదురింపనీయవే

౪

కొదమపు తేటులా యడవిక్రొన్నన పెర్గు సమాలలోన సొం
పొదవిన తేనియల్ మెసవ నూహలు సేయుమదంతకంటె నీ
పెదవులనుండి జారిన నవీనమరందము లారగింప నా
హృదయపుపాత్రలోన హృదయేశ్వరి! నింపుము ప్రేమరాగమున్ ॥

౫

మరువక చూడుమల్లవె? సమాధులలో ననబోడు లెంత సుం
దరులయి నిద్రబోదురొగదా! యెటువంటి మహాత్ములిందరీ
ధర శయనించినారలొగదా! జనియింపడు నేటికొక్కఁడున్
మరువకు సృష్టిమర్మమిది మానిని! చారువచోవిలాసినీ!

౬

ధరణీరాజ్యమునన్ భుజాబలమునన్ దర్పాంధకారమ్మునన్
పరిపాలించి సమస్తభోగముల నాస్వాదించు రాజన్యు లే
గిరి, వారింగురియించి పాడదుగదా! కించిత్తు భూకాంత యూ
పిరియున్నప్డె సుఖింపమేలు తరుణీ! ప్రేమార ముద్దీయుమీ!

౭

సమతాంగీకృత నిర్మలాంకితసుఖాసంశ్లేష గాఢానురా
గమునం దేలుటకుద్యమించు మనయాకాంక్షన్ వృథాటోప కో
పమునన్ భానుఁడుఁ గాంచలేక యరుణజ్వాలల్ వెలార్చెన్ నిమే
షములో నెంతటి మార్పువచ్చునొ? పరిష్వంగంబు గావింపుమీ ॥

౮

ప్రేమమోహంపుబంధాలఁ ద్రెంచలేక
వలపుముద్దుల కబ్బంబు వ్రాసినాడ
ప్రణయగీతాల మరుహజారమ్ములావు
ప్రియతమా! స్వాగతమ్ము విన్పింతు రమ్ము.

---

## హి త బో ధ

౧

మనలోనే కలహాలఁ బెంచికొని మోమాటంబు వోనాడి గుం
డెను కొండంబలెఁ జేసి శాత్రవులతో ఢీకొన్న రీతిన్ బలా
లను కోపాలనుఁ బెంచుకొన్న నిది ధర్మంబౌనె? తండ్రీ క్షమిం
చిన నేపాటిది నీకు నాకొఱకు నీచివ్వన్ విసర్జించుమీ.

౨

అల్లుని శత్రుఁగాఁ దలఁచి యాహవసీమనుఁ గాలుద్రువ్వి మ్లే
చ్ఛుల్లవలేశమేని దయఁజూడనివారలఁ బొందు సల్పి నా
వల్లభు పంచప్రాణములఁ బట్టి తెగించెద వేల? నా నుడుల్
కల్లటయా? తనూజనికఁ గాదటయా! జయచంద్ర నాయనా!

3

ఏ సుముహూర్తకాలమున నింపు సుగంధము జల్లునట్టి స్వే
చ్ఛాసుమరాజి బీల్చితొ? భృశంబుగ నన్నుఁ గనంగ నట్టి దీ
ఖాసుమరాశి నే నయితిగాదొకొ? తండ్రి! తిరస్కరించి నా
భ్రూసిత భాగపుం బసుపు బొట్టునపాకరణం బొనర్తువా?

౪

నందన నన్ననేనె? మరి నందనుఁ డన్నను నేనె యౌదు భూ
వందిత! యీ కనోజి పరిపాలన నీతరువాత నాది గా

దందువ! నన్నుఁ బెంచిన మహత్తర పుణ్యపురంధ్రి తల్లి కే
మందువు తండ్రివై యిటుల నర్థపుఁ జేతలఁ జేయఁజెల్లునే?

౫

అఖిల భారతమునకు దివ్యామృతంబుఁ
జేపి రక్షించు గోమాతఁ జిన్నమెత్తు
కరుణ సూపక వధియించు తురక జనుల
నాయనా! నిశ్చయమ్ముగ నమ్మరాదు.

౬

హిందువులలోన హిందువు
లెందున సంబంధమింత యేనియు లేకు
న్నందున మన భారతమున
చిందులుఁ ద్రొక్కినవి శత్రుసేనా వ్రజముల్.

౭

జయచంద్రు రతనాల సదనానఁ దనివార
విహరింప దింక నీ ప్రియతనూజ
ఘన కనోజిపురంపు కనక పీఠికమీద
కాల్ పెట్ట దింక నీ కన్నకడుపు
పృథ్వీరాజు మనోజ్ఞ మృదులాంకభాగాన
నిదురబోదింక నీ నీకుమారి
ఢిల్లీరాజ్య శ్రీ యిడిన నతిసముదాయ
మందుకో దింక నీ యనుఁగుపట్టి
అల్లునకు మామకును యుద్ధ మావహిల్లి
విలయ కాలాగ్నులిఁక విజృంభించునెడల
నాయనా! రాయబారమ్ము నడుపుకొమ్ము
పట్టుదల వీడు తురకల జట్టు వీడు.

---

# సుబాసుబాబు

౧

రెండు శతాబ్దులా బ్రిటిషు జేదుల పాలనలోన మ్రగ్గి పెన్
గండములన్స్మరించిన యనంత చిరంత దిగంత దంతురో
ద్దండ యశః ప్రభూత గుణధార్మికశాలిని భారతాంబ నీ
యండనుఁ జూచి యుబ్బినదిరా! రణకోవిద! బోసునాయకా!

౨

సింగమువై దగా బ్రిటిషు జిత్తులమారి సృగాలమున్ జగా
భంగ మొనర్చలేపిన సిపాయిలుఁ బేరు నజాదు దండుగాఁ
బొంగిన గుండెతో నిలిపిపోయిన నీదు పరాక్రమంబు నీ
యొంగిలిఁ ద్రావు తమ్ములకొకింత ఘటిల్లునె? చర్చ సేయఁగన్.

3

అదిగో! పండిన నిండు స్వేచ్ఛ యను సంధ్యాలక్ష్మి దీపచ్ఛటా
భ్యుద యానందకరంబుమై యొగిఁగకుప్పల్ పూసె! నీయూహ, నీ
హృదయావేదన వేడి బాష్పములు కోర్కెల్ పండుగా మారె, నీ
యదనన్ డాగితి వేడ నీ ప్రగతి నీ యావైనముం దెల్పవా?

౪

చిఱుతజపానువారిని వశీకరణం బొనరించి యా మహో
గ్ర రణములో విరోధుల శిరాలుఁ గరాళఁ గృపాణదేవికిన్
బొరిబొరి భోజనంబుగ ననూహ్యముగా నిడినట్టి విక్రమ
స్థిరుఁడవురా! నమశ్శతము దివ్యదఖండ యశః ప్రభాకరా!

౫

ధర నొక్కుమ్మడి నేలు తెల్లదొరలన్ ధైర్యాన మార్కొంచు సం
గరమున్ భారతజాతి వాహిను లనేక గ్రీవులంజేసి హి

ట్లరు సన్మానము లందివచ్చిన సుధాలావణ్యమూర్తీ ! బరా
బరులో యిా ? భవదీయనిర్మల యశఃపాదః చరిత్రానికిన్.

## ౬

ప్రళయభీకర మహా రణరంగ భూమిలో
సీమ భూపతి కన్ను చెదరు వేళ
అహిత భీకర మారణాయుధ సామగ్రి
విఱుచుకుపడ మిన్ను విఱుగు వేళ
గోసాయి గుజరాతు కోమటి మూర్తిలో
నలఘు దివ్యజ్యోతి వెలుగు వేళ
ప్రతినాయకుని నిబ్బరపు జబ్బలో స్వేచ్ఛ
బీజాలు మొలకలై పెరుగు వేళ
బక్కచిక్కినట్టి భరత పుణ్యసవిత్రి
యుగయుగాల దాస్య నిగళయుగముఁ
ద్రెంచ కదనభూమి జృంభించి శాత్రవ
ప్రతతి గెల్చినావురా ! సుబాసు !

## ౭

నలువది కోట్ల తమ్ముల వినాశపు పాపపు దాస్యబంధ శృం
ఖలముల వీడఁగొట్ట మొనగాడవునై యురమొడ్డి హూణ రా
జుల పరిపాలనా కుటిల క్రూర పిశాచికరాళ దంష్ట్రికల్
నలుగ రణంబులో నిలిచినావు, సెబాసు సుబాసు నాయకా !

## ౮

ఢిల్లీ కన్నులుఁ దేరుకొన్న యవి నీఠీవిం బ్రదర్శింప లాల్
ఖిల్లాపై జగజగ్గు బావుట సెలంగెన్ గప్రపుంబూలమై
జల్లెన్ హిందు ధరాలలామయు సుషస్సంధ్యారుచిం దేలె మా
పల్లీ పక్కణముల్, పురాతనపు సంపత్కీర్తి మాకబ్బుతన్.

౯

మేటి యజ్ఞాదుదండు లురిమెన్ గలహాభ్రగృహాంగణంబులోఁ
దీటిన కోరమీసలకుఁ దెంపరిలావయి, మాతృదేవతా
కోటి కిరీటిరత్నరుచిఁ గూర్పగ సాయుధులైన తమ్ములే
కోటి గళాలతో నెదురుకోలును సల్పిరి నీకు ధార్మికా!

౧౦

హిందూరాజ్య రమాధిదేవి తొలిపూయించెన్ సుధామంజులా
నందోత్తుంగ యశఃసుమంబు జగదానంద ప్రభూతంబుగా
బృందారణ్యము దీటు తగ్గ మరియేదీ! నేఁడు నానూనపున్
గందమ్మింత ఫలించుగావుత! భవద్గాఢాచ్ఛ వాంఛావళుల్.

౧౧

స్వాగతమిచ్చుకొన్న యవి పశ్చిమ భూములు నీ చరిత్రలో
భాగముఁ బంచికోగ మునిభానుఁడు మోహనదాసు గాంధి నీ
చాగముఁగాంచి విస్మయమెసంగె భళాయన దిక్కులెల్ల మా
ర్మ్రోగ మహావిజృంభణ నిరూఢపరాక్రమ వీరదుందుభుల్.

౧౨

నియమబద్ధమైన నీ ప్రత్యణువునందు
పౌరుషంపు ధునులు పరువులెత్తు
పిరికికింత దారి చొరరాని నీయెద
పురుషబలము పొంగు లురకలెత్తు.

౧౩

నవఖండములకు నానానూనధర్మ వి
ద్యానూన సురభిళ వ్యాప్తచరిత
బుద్ధదేవుని మహా బోధివృక్షపు నీడ
నెళవుగాఁగొన్న పునీత మహిళ

రసపుత్త్రి విజయ సంగ్రామ రంగములోన
ధ్వజము నెత్తిన దివ్య విజయలక్ష్మి
దిగ్దిగంతాల సంధించి విజ్ఞానంపు
కంబాలు నిలిపిన కన్నతల్లి
సదమలాత్మ భరతక్ష్మాంబ యెంతటి ధన్య
రాలొ, యెంత పూజ్యురాలొ, యెంత
యప్రమేయురాలొ యాత్మనందనునిగాఁ
బడసె నిన్నురా! సుబాసుబాబు!

౧౪

జాబిల్లి న్నిరసించు నీదగు ముఖాబ్జంబెంతగా కందెనో
బాబూ! పాదములెంత పొక్కెనొకొ? దుర్వారోగ్రపుందారులన్
గాబూలెట్లుగ మించి చొచ్చితివి నీగాథాప్రవత్తుల్ కటా!
సోబత్తింత నెఱుంగలేని యనుజుల్, చుట్టాలు గుర్తింతురా!

౧౫

ఎగబ్రాకినవి నీ యమృతకీర్తి మేఘాలు
విశ్వప్రపంచాభ్ర వీధిదాక
ఫలియించినవి నీ యుపన్యాస బీజాలు
యనుజుని గుండె కమ్మని పొలాన
చిత్తగించినవి నీ శ్రీవాక్య మణిభూష
ణములు భారతము మస్తము ధరించి
నంతసించినది నీ సాహసోదగ్ర చే
తముఁగాంచి ఘనబంగళము పురంధ్రి
మ్రొక్కెనది దిశాగోళమ్ము ముగ్ధయౌచు
నరనరంబుల పౌరుషం బురలిపోవు
నీ తనూవిలాస మది మంటిని గలసెనె?
వందనశతమ్ము గొమ్ము సుబాసుబాబు!

---

# ఏ ఱుక

౧

తెలుఁగు వాఙ్మయజలధిలో జలకమాడి
వలపురతనాల పదముల తిలకమద్ది
జిలుగు మెఱుగుల మవ్వంపు చీరెఁగట్టు
చేవఁగల బోటి నా కవితావధూటి

౨

ఈ కవికోకిలాలపన మీసుమనోజ్ఞ కళాపునీత క
న్యా కమనీయ నవ్యనటన ప్రవిభాసితమైన రేఖ! వి
ద్యాకలనమ్ము లీ సరసులాత్మకు నిత్యము మోదమీయదే?
కాక వసంతగాన కలకంఠి సుకంఠము కంటకంబెగా?

3

కమ్మని తేటతెన్గునుడికారపు సొంపురసార్ద్ర దివ్య భా
వమ్ము లిఖింపనేర్పు ప్రతిభాయుతుఁడైన కవీంద్రు దొడ్డ గం
టమ్మున నుండుగాని కవనమ్ము రచింప నెఱుంగలేని, ద
ద్దమ్మ కలానికీ విషయమందునె? తన్పుక చచ్చునేనియున్.

౪

నన్నువరించివచ్చె నొకనాటిద యీా కవితాలలామ! పే
ర్గన్న కళావిభాసిని, జరామరణంబును లేనివాణి! పా
మ్మన్నను పోని కన్యక, నితాంత యశఃకలితాభిరామ సం
పన్న తెనుంగుశారద శుభంబిఁక జన్మము ధన్యమయ్యెడిన్.

---

# నిరాశ

౧

ఈ కఠినప్రపంచమున నీ కలికాలయుగాన సత్కళా
శ్రీకి ఘటిల్లునే? ప్రశుభచిహ్నితగౌరవ సంపదాళి, శ్రీ
లోకము చేతిలో నిలిచి లోకముఁ గుడ్చునె? గంజిబువ్వ పే
రాఁకటఁగొన్న సత్కవికి నన్నముఁ గుప్పెడు కల్గునే? తలీ?

౨

జీవితమే యెడారియయి చిన్నము సౌఖ్యములేని నేను, నా
జీవితమెందుకో యనుచు చింతిలుచుందు క్షుధార్తిమూర్తినై
నావినుగున్, గళాధనమునన్ గనిపెట్టు రసజ్ఞమూర్తి లే
డా! వసుధాతలాన భరతాంబిక! నా బ్రతు కింతియేనటే?

3

నా కమనీయ కావ్యలలనా నవమోహినిగాన నిర్ఘరిన్
దేకువమీర మున్గినది దేముని ముచ్చుల జాతి, స్వార్థపుం
జీఁకటికోణమందనుచు చిన్మయమూర్తులు దారి నిత్తురా!
ఆఁకలిదీర్తురా! కళలకాదరణంబిడి యుద్ధరింతురా!

౪

ఎవఁడు సృష్టించినాడొ? యస్పృశ్యజాతి
కలదె? వానికి శాంతిస్వర్గమున నేఁడు
నెందఱెందరు చితికెక్కి యేడ్చినారొ?
ఇంక నెందరు చితికెక్కి యేడ్తురొక్కొ?

౫

అరుచియు రుచ్యమెర్గని దివాంధపుజాతికిఁ గన్నులున్న రా
తిరిఁ గనిపించునా? పగలు దీనులుఁ బేదలుఁ గానిపింతురా?

చరఖమునీశ్వరుం బ్రబలశక్తుల చాటున డాగి డాగి ట
క్కరితనపున్ నినాదములు గారడిసేతలుగాక! చూడఁగన్.

౬

పాపులపాలిట దిక్కై
యేపారిన యేసుక్రీస్తు హిందూక్షితికిన్
బ్రాపయి మ్రొక్కులుగొను మా
బాపూజీ వాక్కులింత ఫలియించునటే?

౭

కరుణకుఁ దావుఁగల్గు మొనగాండ్రు జనించిన ధర్మసీమలోఁ
గరుధ యొకింత సూపని యకల్మషులుండినవారిలోనఁ గొం
దరుఁ గరుణాస్వరూపులు, గుణాన్వితశీలుర త్యాగశక్తికిన్
హరిజనభావమే తొలగెనా? నుడులెందుకు వేయిబల్కనన్.

౮

కొడుకుల్ ఖద్దరుధారులై నిలిచి నీకున్న మహాఖ్యాతికిన్
గొడుగుల్ బట్టిరి, సర్వదేశములు నిం గొండాడ, స్వాతంత్ర్య వీ
ర ఢమారావము మ్రోతమ్రోగినది నై రాశ్యాన జీవించు నీ
వెడమన్ జేసిన జాతివారి కికలేదే? శాంతి సౌభాగ్యముల్.

౯

ఎందుకు మానవాకృతిని సృష్టి యొనర్చెనొ? చెప్పునా? చిదా
నందుఁడు, చెప్పుచోఁ గలుగునా? మరియాదలుఁ, గల్గుచో మహా
నందము నొందునా? కడుపునం జెలరేగు దవానలంబుకై
ముందర ప్రశ్నకై యెదురుబోధలు సేయునె? భారతాంబికా?

౧౦

ఇది నా కాంగ్రెసు నాకు పూచిగలదిం దేలోప మున్నన్ బదా
బదలై పోయిన నేఁటి కాంగ్రెసు కళాభామామణిం దిద్దఁగన్

గుదురన్నేర్తురె, నా సహోదరులు నాకుంగల్గు ధీశక్తితోన్
బదివేయేండ్లు జపించినన్ గలుగునే? బాపూజి స్వప్నార్థముల్.

౧౧

ఏపుడో బుద్ధుఁడు నేసుక్రీస్తు జనులం దింతింత ప్రేమంపు టా
లపనంబుల్ గఱపించినారలు సముల్లాసోజ్వలాధీశులై
యిపుడీ యిండియ పండుతాత పలుకేమీ! తక్కువా కాదునే
డుపులైనారె సమానతత్వమున దూర్తుల్ నాదు భ్రాతృబ్రువుల్.

౧౨

ఎవనికి వాడె బాహువుల నెత్తి సవాలునుఁ జేసికొంట నీ
యువమతి జాతిలక్షణముటన్న నొకప్పు డఖండ దివ్యభో
గ విభవ మందుకొన్న గుణగణ్యావు నీ కుదయించు నీతనూ
భవుల కిదేమిటమ్మ! తలవంపులు సేయుకు బుద్ధి సూత్రముల్.

౧౩

ఈక్షణిక జీవితమ్మున కేల యింత
లేని గప్పాలు చిత్తప్రవృత్తి మార్పు
మరణమొందిన నిముసాన మంటిఁగలియు
నరుడు తనదింత తీసుకొన్నదియు లేదు.

౧౪

క్షమమున్ సాధనఁజేసి తెచ్చిన లసత్ సంపూర్తిస్వేచ్ఛా శతాం
గము నెక్కన్ నయిదోడు తానలతి తానంబిచ్చునం చానతోన్
సుమపుంగుత్తియ లారతిచ్చితిని కన్నుల్ మిన్నుగాఁజేసి పా
పము! తానెక్క నస్యందనమ్ము నిఁక నాపై దోలుచున్నాఁడమా!

౧౫

ఇదిగో! నా కవితాకళానతిని మున్నీరాజు పోషించినా
డది స్వర్ణాక్షరమాలలై యెనఁగ తానాహా! కడున్ మందభా

గ్యదశన్ దేలెడువాఁడు నేఁడు గలదే ? కాంతుల్ కళా లక్ష్మికిన్
కదురున్ ముట్టని జాతులుం గలుగు నీ గమ్మత్తు లోకమ్మునన్.

౧౬

నాకును రెప్ప విప్పిన కణమ్మున సుందర విగ్రహాత్మకళా
శ్రీకి నివాసమౌ క్షితిని చీకునుఁ జింత నిరంతరోగ్ర దుః
ఖాకృతిఁ దాల్చు పేదల ముఖా లగుపించునుగాని తల్లిరో!
ఈ కలవారలీ ప్రభువులీ సుఖభోగులుఁ గానిపింతురా!

౧౭

ఎన్ని దీపావళుల కాంతు లిగిరిపోయె
భయద కాల తస్కరుని నిశ్వాస కతన
నెన్ని దీపావళు లిఁకను పృథివిలోన
వెలయనున్నవొ ? యేరికి తెలియఁగలదు.

౧౮

ఇది సిఫారసులోకమ్ము ముదిమిబట్టి
మూలవడుటకు నింకెన్ని పుష్కరములు
జరుగవలయునో ? కాలచక్ర రథగమన
బహుమహా వేగమను గృహాభ్యంతరమున.

౧౯

చుట్టుముట్టడికి నా శుభసంస్థలోఁ జేరె
ప్రతికూల రాక్షసి పచ్చిబలము
పలుకుచున్నారు బొజ్జల పోషణార్థమ్ము
పదవి నాకాక్షించి స్వార్థపరులు
ధ్వంసమ్ముఁగావించె పనికిమాలిన యుప
న్యాసాలు దేశభాగ్యాలనెల్ల

వెఱపొంచె హస్తినాపురి కోట బురుజుపై
గారాల ధర్మచక్రధ్వజమ్ము
అమృతసారంబుఁ గురియు నాయకుల మనము
క్షప్త సమరసభావంపు లేమికతన
పాడుపడ్డది నా రత్నభావ గీతి
తొలకరించునె? నాపాట మొలకలెత్తి.

౧౦

నా హృదయవార్ధి నుబుకుచున్నవి కవోష్ణ
భావవీచికా సందోహ పరమదీప్తి
రాణఁజెందునొ? తెలుఁగు పొలాన, లేక
కునికిపోవునో? పాలిపోయిన కులాన.

౨౧

నీ పూరికొంపలోఁ గాపురం బొనరించె
గతిలేని లేమి పాల్గంటి తల్లి
నీ గర్భగోళాన నిండుకొన్నది సుంత
విద్దియ నెఱుఁగని ముద్దుగుమ్మ
నీ రక్తనాళాలఁ జారుచున్నది భయా
నక రూపమున నహంకారశక్తి
నీ స్పృహాసౌధాన నెఱిలాస్య మొనరించి
చీకు నల్పెను చింకి చేటలమ్మ
రెండువందలేండ్లనుండి నీ నెత్తిపై
వడ్డ భరము నాప బలము లేక
బక్కచిక్కి చివికి బ్రతికిన దాన, నీ
పండుకాపురంబు ప్రబలుటెపుడొ?

౨౨

వ్యక్తిస్వార్థమ్ము వర్ణతత్వాలు నేఁటి
రాజకీయ శ్మశాన దురంతసీమ
వికృత రూపాన దయ్యాల విధము నర్త
నం బొనర్చుచుఁ దూలుచున్నది మదంబు!

---

# సంక్రాంతిసందేశము

౧

దినవెచ్చమునకు బత్తెము లేని, నిఱుపేద
దంతాల ముత్యాల కాంతులీన
తెలుఁగువీధుల శుభోజ్వల శోభనపు పెంపు
నిండారు ముగ్గులు తాండవింప
బంగారు సృష్టించు వరిపొలాలకు, కృషీ
వలులు పొంగుచు నమస్సుల నొనర్ప
సన్నసన్నగను దిశాసంభృతంబైన
చిఱుగాడ్పు పిల్లల చుఱుకు మెచ్చ
నవయుగారంభ శుభమహోన్నత విభూతి
గంపకెత్తించి మకరసంక్రాంతిలక్ష్మి
పంచిపెట్టఁగ వచ్చె నీపాలి భాగ
మందుకొనవోయి నీదె? వీరాంధ్ర తనయ!

౨

కడకంటం బ్రసరించి చూడుమదె లోకక్షేమముం గోరు న
బ్బడుగుం బేదల నీతిజీవనసుధాస్వాంతాలు, సంక్రాంతిలో
గుడిసెల్ గూడను నిబ్బరించినవి సిగ్గుల్‌సిమ్మి యానంద మి
క్కడ నృత్యంబొనరించి జాతికి యలంకారంబుగా వెల్గెడిన్.

## 3

ఈ సింగారము లీయొయ్యారములు నా యీ స్నిగ్ధపుంభావ వి
న్యాసా లీ నునుదేరు ముగ్గులు, కళానందస్వరూపాంతమై
యీ సంక్రాంతికి వన్నెగూర్చినవి అంయా మేల్మివస్త్రాలతో
నీ సంతోషముఁ బంచుకొమ్మిక గుణాబ్ధీ! ఆంధ్రవీరాగ్రణీ!

## ౪

ఖరుచైపోయినగాని పందెములకున్ గాలింతదూరానఁ బె
ట్టరు పూ వెల్మలు; కోడిపందెముల వాటా లేని యాంధ్రుండు నే
డరు దన్నుంబనిలేదు గ్రామముల నంతా క్షేమమేనా! సహో
దర! సంక్రాంతి శుభాలు మీకగుత నాంధ్రంబుబ్బి పొంగారగన్.

## ౫

ఆంధ్రశౌర్యజ్వాల లగుపింప పందెమున్
కొక్కొరో యనెను నీ కోడిపుంజు
నవనవోజ్వల భావనలు రాష్ట్రదీక్ష రే
కెత్తించె నీ నల్వదేండ్ల వ్రతము
తెలుగిండ్ల మొగసాల నిలిచి మేల్కొలుపఁగా
శంఖమ్ము నూదె నీ జంగమయ్య
డూ డూ డు బసవన్న క్రీడ మోదింపించు
ఘల్లు ఘల్ మువల నీగంగిరెద్దు
తెలుఁగువీధుల నవకంపు వెలుఁగుఁజాడ
లెల్ల దిశలందుఁ బంచె నీ పల్లెసీమ
బూజువట్టిన సిద్ధాంతములకు బోక
తమ్ముడా రమ్ము : ఆంధ్రగానమ్ము బాడు.

---

# పటేలు

౧

ఏమి! జాతికి మూలకంబమగు వాఁడే యేగెనా? భారత
క్ష్మామాంగళ్యముఁ జక్కదిద్దిన ప్రశంసార్హుండు, సాబర్మతీ
స్వామింగొల్చిన దొడ్డవాఁడు ప్రశుభస్వాంతుండు బృందావనీ
సీమంజేరెనె? వల్లభాయి యనుజుల్ చింతాబ్ధి నల్లాడగన్.

౨

"జవహరులాలు నెహ్రూ నడిసన్న యుదాత్త మహామనీషి! మహా
నివిధుఁడు గాంధి వారసుఁడు నీవు గతించినవెంటనే పటే
లు! విడిచినాడు బాష్పములు రోజుచు దిక్కులకెత్తు నీ యశ
శ్చ్ఛవులకుఁ బాఱజల్లిన విశాల వినిర్మల కీర్తికి న్నతుల్.

3

భరతపవిత్రి నిబ్బరపు గుండియలోన
ప్రళయకాలాగ్ని కీలల దహింప
సినలైన జాతి కాంగ్రెసు నాయకేంద్రుల
మెత్తని చిత్తాలు చిత్తువోవ
లలిత శోభాకళా లావణ్య రుచిఁ జాటు
సిరిమించు బావుటా చిన్నవోవ
మొన్నమొన్ననె దేశమున దాపురించిన
శాంతిదేవత మేను జలదరింప
భరత ధాత్రి తండ్రివై రాటుతేలిన
వల్లభాయి మమ్ము బాసినావు
కొంప చక్కదిద్దు కొడుకులఁ గన్నట్టి
హిందుమాతృక దురదృష్టరేఖ.

# స్వేచ్ఛాకాంక్ష

౧

తొలఁగిపోయినది యాంగల భూపు నర్థించు
దిక్కుమాలిన బీద బిక్కుతనము
చెరగిపోయినది దుర్భర దాస్య నిబిడాంధ
కార రేఖా చమత్కారముద్ర
వెలిసిపోయినది దిక్కులఁ జలాయించిన
పగవాని బావుటా పచ్చదనము
ఇంకిపోయినది రాట్కైంకర్యపు న్మేన
పరవళ్ళుఁ ద్రొక్కిన పందతనము
తరలిపోయె తెల్లదొరగారి చెప్పులు
మోసి బ్రతికినట్టి మోటుబ్రతుకు
విజయకాహళాలు వెలిగించుకొన్నాను
పూర్ణరాజ్యమంచుఁ బొంగినాను.

౨

అనుకొన్నాను సమగ్రపుం భరతరాజ్యంబందు నా నామమున్
గణియింపంబడునంచు నాయెద స్పృహాకాశా మహామండలం
బున నా బంగరు టూహలన్ని యయయో? పాలారకంబోయె, నీ
దినమున్ దిగ్జయ భావగీతికల కేదీ! పాడఁ దావింతకున్.

3

పున్నెము మూటఁగట్టుకొని పున్నమ వెన్నెల కీర్తిఁదోగు సం
పన్నకుటుంబి నీ భరతభామిని! నీకు నమస్కరింతు నీ
పిన్నలు పాపలున్ నిలుచు విశ్వమహానమతా స్వతంత్రతన్
భిన్నత లేని రాజ్యమున బేరజులుండు టదేమికర్మమో?

౪

జర్జరించినది ఘూర్జర సెట్టి మరణాన
విశ్వంభరాదేవి విమలతనువు
చితికిపోయినది భారత పుణ్యగేహిని
కుదురైన పిడికెడు గుండెకాయ
వణికిపోయినది ప్రవర్ధమానంబైన
జాతీయకాంగ్రెస్సు సంస్థలక్ష్మి
మునిగిపోయినది దుమ్ముదుమారపున్ వార్థి
యనుఁగు సోదరుల దోహదపు మాట.,
పరువు మాటె మాదు వందు సంసారంబు
కినిసి దెబ్బలాడుకొనుట కతన
పరువుకొఱకు మేము బ్రతుకలేమది గాని
పదవికొఱకు మేము బ్రతుకగలము.

౫

ప్రళయ పురుషుండు విలయ నర్తనముఁజేసి
సర్వ భూప్రపంచమును నాశనమొనర్ప
కటిక చీఁకటి తెరల రంగస్థలానఁ
బొదలినాడు క్షమాపుత్రుఁ డుదయమగునె ?

౬

ప్రత్యక్షమైనది ప్రళయాగ్ని భల్లమ్ము
కమల జాండము నిప్పు కలమునుంగ
దీర్ణమైనది హిందుదేశమ్ము గర్భమ్ము
తురక తమ్ముల కత్తి చరితలోన
శిథిలమైనది సర్వ పృథివిదేవత మెచ్చు
శాంతి సమాధాన సదనభూమి
మందమైనది సుధామయ కళాశోభిత
సత్కవీంద్రుని చాకచక్య రచన

అమృత మయమైన రామరాజ్య స్వరాజ్య
భవన భాగంబు లభియింప వలనుపడదు
బక్క కోమటి ఖదరు షట్పదనినాద
గీతికల మ్రోతలింత తగ్గినవి నిజము.

---

# హెచ్చరిక

౧

చల్లారెనే? బౌద్ధ సన్న్యాసి కట్టిన
యను కంపమగు మేటి యజ్ఞవాటి
అణగారెనే? నరేంద్రుని వీరహైందవ
జాతీయగీతా ప్రచార రవము
ఆగిపోయెనె? బయిరాగి కోమటి తాత
రాటాల తుమ్మెద పాటలవము
నశియించెనే? భువనంపు మ్రొక్కులఁగొన్న
రమణ మహర్షి వజ్రాలతపసు
పూచిపండిన సత్కీర్తి నోచుకొంచు
ఘనతకెక్కిన బిడ్డలఁ గన్నతల్లి
నీ భరతమాత దేశాలనించవోయి
ప్రథిత గౌరవశ్రీల నో భారతీయ.

౨

త్యాగానం దెలవారుఁ దల్లడిల బ్రహ్మాండంపు పోరాటమున్
సాగింపం దొరకొన్న బాపుజి యహింసాసూత్రమార్గాన, దీ
క్షా గాఫల్ పతియించి కాంగిరెసు లక్ష్యంబున్ సమర్థించు నీ
కీ, గోచీచ్యుతమైన దేశమునకేదీ! సిద్ధి దీక్షారతా!

3

సాగుచున్నది వర్ణసంఘాల భేద పై
శాచికి దీర్ఘ నిశ్వాసబలము
నిక్కుచున్నది నీతినియమమ్ము విడనాడి
పక్షపాతంబు గప్పాలమారి
ఆడుచున్నది రహస్యము గిహస్యము వీడి
నడివీధి లంచాలనంగనాచి
త్రాగుచున్నది దరిద్రజనాళి రుధిరమ్ము
పేరైన నల్లబజారు జలగ
శ్రమలవడ్డ జాతిసాయంబుఁ గాంక్షింప
సానుభూతి నిడని జాతిసమితి
ఖదరుమౌని దొడ్డ కట్టడి కెదురయ్యె
పరువు నిలుపుకొనుము భారతీయ !

౪

ఒకవంకన్ వికటాట్టహాసమున నత్యుగ్రంపురోషానఁ గా
టకపుం దయ్యము వాడి దంష్ట్రికలు బిడ్డా ! దేశముం జీల్చఁ జా
చుకొనన్ విందులుచెట్లు పబ్బములు పస్తుల్పడ్డ దేశానికిన్
సుకముల్ గూర్చునె? యొక్క ప్రాణికయినన్ బోనంబు లేకున్నచో.

౫

నన్ను నేలి నాకు నన్నంబు నిడనట్టి
స్వంత ప్రభుతకంటె జాతిదొరల
ప్రభుత మేలటంచు వాపోవు తమ్ముల
ప్రశ్నమునకు నీ జవాబదేమి ?

౬

గణియింపందగు వీరభారత మహాఖ్యాతిన్ బుటల్ద్రిప్పి, సా
ధనసేయందగు దివ్యభారతపురాధర్మంబు స్థాపింప, బో

ధన సేయందగు శాంత్యహింసల యథార్థత్వంబు రూపించి, పా
లన సేయందగు నీతిమార్గమున వీరా ! నవ్యహిందూసుతా !

౭

పుణ్యదేశపుటింటి మొగసాల నాడన
యినుపగజ్జెల తల్లి కునుకుదాక
కులగోత్ర బంధనమ్ముల బంధితంబైన
శీర్ణభావములు నశించుదాక
ప్రతి పేదవాని సాంత్వనపు గుండియలోన
వెలుఁగు వెన్నెలతెన్ను కలుగుదాక
భువనమ్ము లగ్గింప మోజైన సమతయే
యెల్లరి హృదయాలు నేలుదాక.
సెలఁగి రేగి యిలు విజృంభించి, స్తంభించి
నిలిచిపోయినట్టు నీతికన్య
మరల భారతమున కెరలి మసలుదాక
మగతనమ్ము వీడతగదు తండ్రి !

---

## రాష్ట్రవిజయదుందుభి

౧

ఆరలేదింక భాషారాష్ట్రవిభజన
వ్యత్యాసభావ దావానలమ్ము
కలియలేదింక ముక్కలు చెక్కలైపొర్లు
నిలయానఁబడియున్న తెలుఁగునేల
తెమలలేదింక గౌతమివాహినీదేవి
లాస్యాన నణఁగారు సస్యలక్ష్మి
పూయలేదింక శ్రీ పొట్టిరాముని దివ్య
దాశయసిద్ధి దీక్షాసుమాలు

అలుముకొనఁగలేదు తెలుఁగన్న గుండెలో
భ్రాతృభావరసవిభాసభూతి
ధర్మచక్రమెత్త దయసేయరావమ్మ
దివ్యకల్పవల్లి తెలుఁగుతల్లి.

౨

ఎపుడో నీకొమరుల్ కుమార్తెలు కడున్ హెచ్చైన త్యాగాలు స
ల్పి ; పురాధర్మము నిల్పఁబెట్టి యశముం బెంపెక్క నారన్న దొ
డ్డపదం బీనిముసంబుదాక నమరున్ డంబంబుకాదిద్ది, నీ
కృపగర్భంబు ఫలించె విశ్వమున తల్లీ ! ఆంధ్రరాజ్యేందిరా !

3

తను రక్తంబును ధారవోసిరి యనంత త్యాగదీక్షా మహ
త్తును సాధింపఁ గుమారకుల్ తెలియలేదే తొంటిబంగారపున్
మనికి వెంతటి పుణ్యురాలవుగదమ్మా ! నేఁటి స్వేచ్ఛాదిన
మ్మున సుస్నిగ్ధసువర్ణపూజల శుభమ్ముల్ పొందు మాంధ్రావనీ !

౪

నాజూకునడకలో మోజు చూపుటచేత
తేలిపోయినది నా తెనుఁగుబాణి
పెరవాని బానలో నెఱుక నేర్చుటచేత
అణగిపోయినది నా తెనుఁగువాణి
శుద్ధమూర్ఖుని చెప్పుజోడు మోయుటచేత
దసిలిపోయినది నా ధైర్యలక్ష్మి
మూడువందల కులమ్ముల కుమ్ములాటలో
వాసిమాసినది నా వంశదీప్తి
నలువదేండ్లలోన నలిపిన తపసులో
నుంత యైన నాకు వంతు గలదు,
నన్నుఁ జూచుకొన్న నా కోఱమీసమ్ము
దిద్దుకొందు నేఁడు తెలుఁగుతల్లి.

౫

పూజాభాజనమైన నీ విభవవిస్ఫూర్జద్యశస్ఫీతికిన్
జేజే లిచ్చిరి, దిగ్దిగంతజనముల్ నీమాట పండయ్యె రా
రాజుల్ నీ కొమరుల్ సుఖింపుదురుగా రత్నాలవల్లీ! యిఁకన్
బాజాఁగొట్టెద వీరకావ్య రచనా వైశద్యముం జూపెదన్.

౬

సవరింతు వెఱ్ఱివేషముల వేసెడు నన్ను
తెనుఁగుబాబుల భావదీపకళిక
వివరింతు విశ్వమ్ము ప్రీతిమై కొండాడ
నా జాతికథల విన్నాణపటిమ
పచరింతు నిఱుపేదభావాన నింకని
దుఃఖంపు వేడి నెత్తురుకణాలు
నిరసింతు నభివృద్ధి కరనిరోధకములౌ
గికురింపుపెను ప్రణాళికల వితతి
కులము కలిమిఁగాంచి పలుకరించని యెట్టి
పెద్దనైన లెక్కవెట్ట నింక
నన్ను నీవు మఱవకున్నచో బ్రతుకులో
దివ్య కల్పవల్లి తెలుఁగుతల్లి.

౭

మొలిపించుమమ్మ, పుత్త్రుల గుండియలలోన
సమరస భావ బీజాల వితతి
నిండించుమమ్మ పండిన మేలికీరితి
దశదిశాగోళ వృత్తాలలోన
ధరియించుమమ్మ రత్నఘటిత గౌరవ
శ్రీ కిరీటమ్ము నీ శిరమునందు
మరువబోకమ్మ సంపదకు దూరంబైన
కడగొట్టువాని నీ కన్నవాని

దివిజపంక్తి మెచ్చు తెలుఁగు తేజముఁ జాటి
యఖిల భువన పూజలందుమమ్మ
ధన్యురాలవమ్మ ధరణి నీ సాటేరు
దివ్య కల్పవల్లి తెలుఁగుతల్లి!

---

# శ్రద్ధాంజలి

౧

తొలి విన్నాము శిబిక్షమాధిపుడు సంతోషమ్ము మేని కం
డలు ఖండించి ప్రసాదమై పులుఁగు నుల్లాసంబు గల్పించు వా
క్కులు ; నీవో తెలుగుంధరిత్రికయి ఫక్తున్ గాయమర్పించి త
మ్ముల కీర్తిన్ జగతిన్ రచించితివి బాబూ! పొట్టి శ్రీరాములూ.

౨

బత్తిరహింప గాంధిముని భానుని జాడలనేగునట్టి నీ
సత్తి నెఱుంగు నాంధ్రి ; గుణసాగర ! నేర్పుము ప్రేమతత్వ సం
పత్తి ! యమాయకుండవయి పాపవిధాన నలంగినట్టి నీ
కిత్తు తెలుంగుతండ్రి ! శుభమింపు దలిర్ప మహానుమాంజలుల్.

3

కనిపించుచున్నది తెనుఁగన్నగుండెలో
దయలేని పక్షపాతంపు బుద్ధి
వినిపించుచున్నది భృతిలేని, నిఱుపేద
డొక్కమాడిన చిన్న బక్కపాట
చరియించుచున్నది సమద దర్పముఁ జూపి
నడివీధిలంచాల నంగనాచి
నర్తించుచున్నది కర్తవ్య మెఱుఁగక
జాతిభేదాలమ్మ జాతరమ్మ

ఎన్నినాళ్ళు నింక నేగి సాగునొకదా .
బలము కలుగువాని కలుష రథము
భువనహితముఁ గోరు పుట్టి శ్రీరాములూ
సురుల భూమినుండి చూడఁగలవు,

---

## అంబేత్కారు

౧

ద్వైతాద్వైతమతాలఖండమున నిద్రంబోని యస్పృశ్యతా
భూత వ్యాఘ్రిమహోగ్రదంష్ట్రల బలంబున్ బుగ్గిగావింపఁగా
జాతి శ్రేయముకై కులస్థుల మనస్తత్వంబు మార్పింపఁగా
నే తీరుం గడగండ్లకోర్చితివొ? తండ్రీ! డాక్టరంబేత్కరూ!

౨

అలిగినావు త్వదీయకులవాంఛ ఫలియింప
పండు తాతయగుండె బెండువోవ
చదివినావు సమగ్ర శాస్త్రాలు సీమలో
నాంగ్ల భూమీపతులౌడుగ అవ
చర్చించినావు దేశస్ఫీత సౌభాగ్య
మాశించి బహు విషయమ్ములెన్నొ
ఉస్సురన్నావు తమస్సుకోణములలో
బ్రతుకు పంచముల శుభమ్ముఁగోరి
కుటిల కులపిశాచి పటుదర్పము నణంచ
కట్టినావు వీర కంకణమ్ము
మనువువైయశాన మనినావు, మంత్రివై
యుండియూజగమ్ము నేలినావు.

3

వసతుల్ లేని కొలంబియానగరి విశ్వజ్ఞాన విద్యాలయా
న ; నమత్వంబునుఁ జూపలేని దొరలన్ కంగారుఁ గావించిపెన్
వసతిన్ బొందిన నీ యఖండమగు ప్రజ్ఞాపాటవంబున్ ప్రశం
స ; సరిన్ నిన్ను సృజించు బ్రహ్మకు నమస్కారంబు మేధానిధీ !

౪

ప్రాణము త్రాణమున్ బలము రాణ సెలంగి వెలింగి నేఁడు ని
ద్రాణముగా నశించిన యధఃపతనంపు కులస్థులన్ ; దయా
శ్రీనిధి ! యుద్ధరింప దయచేసిన నాల్గవవేల్పవయ్య నీ
జ్ఞానపు చూపులో నవనిశాస్త్రము లేమగు చర్చనల్పగన్ ”

౫

నీ వేలగ్నమునందుఁ బుట్టితివొకాని ! నీదు విస్ఫార వి
ద్యావైశద్యము లేరికిం గలుగునన్నా ! మాలవంశమ్ములో
నావిర్భావము నొందుటన్ గులపు దయ్యాలున్న దేశాన నీ
కే విశ్రాంతి హుళక్కియైననిఁక మాకేదీ సువిశ్రాంతియున్ ”

౬

కోమటి యెత్తుతో దొరలకొల్వున వాదమునల్పి భారత
క్షేమముఁ గోరుకొన్న మునిసిద్ధుని గాంధినెదిర్చి పంచమ
క్షేమముకై శ్రమించిన విశిష్టగుణాలయ ! నీకతాన మా
కీ, మెయి సౌఖ్యమబ్బెను మరేరికిఁగావలె మా విశేషముల్.

౭

భగవంతుం డనువానికే నమసిపోవన్ ; జాలి, యీలాటి దు
ర్భర దారిద్ర్యములో మునుంగు కులమున్ రక్షింపఁగా మానవుం
డగునే ? యిట్టివి నీయెడం గలవు తాతా ! చూతువా! యిండియా
జగమందుం గల పంచమీయులను బాష్ప స్విన్నదుఃఖాస్యులన్.

౮

కరుణామూర్తి బరోడరాజునిను, నీ జ్ఞానమ్మునుం గాంచి య
బ్బురముంపొంది విశేషవిద్యకయి బాబూ! నిన్ను పంపన్ జగా
పరివిజ్ఞానము, సర్వశాస్త్రముల నభ్యస్తంబుఁ గావించి యు
వ్వరతన్ హూణుల మేలివాక్యముల దొంతుల్ గొంటి; స్తుత్యంబగున్.

౯

ఆంఘప్రక్రియలో నటింపక, దయావ్యాసంగముం జిక్కు మా
గాంధీ దేశమునందు నిమ్నజులకున్ గంజైన లేకున్నచో
హిందూసంఘము వీడుటే సొబగు వేయేలా? యెవండిచ్చు నా
పందం బింత తెగించువాని కిఁకనన్నా! తెడ్డు సామ్యంబగున్.

౧౦

పారసీయుల ముసాఫరు సత్రశాలలో
నిదురింప జేనెడు నేల లేక
ధనవంతులమెరికా కనక ఖండములోన
వసతిగృహంబులో బసయు లేక
ప్రభువు ఋణార్థమై పనిచేయఁ గాంక్షింప
సివిలుసర్వీసులో సీటులేక
భయదకుల వ్యాఘ్రి స్వైరవిహార దు
ర్వీధులలోఁ గాలుఁబెట్ట లేక
ఎవడు చదువలేని పృథులవిద్య గడించి
యభినవ మనువంచు నఖిలజగతిఁ
బేరుఁగాంచి మొన్న భారతరాజ్యాంగ
శాసనాల సృష్టి సల్పినావు.

---

# శుద్ధప్రతి

| పుట | పంక్తి | తప్పు | | ఒప్పు |
|---|---|---|---|---|
| 3 | 2 | భుమి | .... | భూమి |
| ,, | 7 | నిష్క్రంద | .... | నిష్యంద |
| ,, | 18 | సమద్రగ | .... | సముద్రగ |
| 4 | 5 | బాహువై | .... | బాహుపై |
| 5 | 9 | గాధ | .... | గాఢ |
| 6 | 2 | ధనువెల్ల | .... | దనువెల్ల |
| ,, | 8 | దొఱి | .... | డొఅ |
| 16 | 20 | జాటెడిని | .... | జాఱెడిని |
| 19 | 20 | గట్టె | .... | గట్టి |
| 20 | 7 | వంత | .... | మత |
| ,, | 9 | సత్త్యమె | .... | సత్త్వమె |
| ,, | 15 | సట్టు | .... | నట్టి |
| 22 | 3 | మాధవులే | .... | భూధవులే |
| 29 | 5 | పెర్గుసుమాల | .... | పెన్గుసుమాల |
| 38 | 8 | గరుధ | .... | గరుణ |
| ,, | 11 | నీకున్న | .... | నీకున్నీ |
| 40 | 3 | కణమ్మున | .... | క్షణమ్మున |
| 42 | 16 | నీదె | .... | నేడె |
| 43 | 2 | రూపాంతమై | .... | రూపాంకమై |
| 45 | 15 | పొలారక | .... | పొల్పారక |
| 50 | 12 | స్నిగ్ధి | .... | స్నిగ్ధ |
| 51 | 19 | నిందించు | .... | నిండించు |
| 55 | 2 | విశేష | .... | విదేశ |